# భక్తపోతన్న

△

నాటక నిర్మాత

కవికుమార — కవితా విశారద

**శ్రీ అయ్యగారి విశ్వేశ్వరరావుగారు**

△

ప్రకాశకులు

## కాళహస్తి తమ్మారావు అండ్ సన్సు

సంస్కృతాంధ్ర బుక్ డిపో, రాజమహేంద్రవరము.

# పరిచయవాక్యాలు

కవి - స్వేచ్ఛాజీవి! అస్వతంత్రగానాన్ని చేసిన పోతన్న నేను స్మరించుతూ పితృపూజచేయడం ఆంధ్రావనికి అలవాటయింది!

అలాంటి పవిత్రమూర్తి గాథ కళారాధకులు పులకితులుగా స్మరిస్తూ వుండడం ఆచారమయిందికూడా!

తెలుగుదేశంలో ఇలాంటి ఋషిపుంగవుడు - మహాభక్తుడు ఆవిర్భవించడం నిజంగా మన ఆంధ్రజాతి గర్వించదగిన విషయం!

జీవితాన్ని రామాంకితంచేసి - కలకాలమూ భగవదారాధనలో స్వేచ్ఛాజీవనాన్ని నిర్వహించిన పోతన్న పవిత్రచరిత్రను నాటకరూపంగా రచించడానికి అవకాశం కలగడంకూడా మహాద్భాగ్యమే!

ఇలాంటి సదవకాశాన్ని నాకు కల్పించిన శ్రీ కాళహస్తి పౌరులకు నా అభినందనాలు.

నాటకరంగానికీ - చరిత్రకీ విభిన్నంగా వుండే సంఘర్షణలు వుండకమానవు. రసోపాసకులు, కళాభిజ్ఞులు నాటక నిర్వాహకతను పరిశీలించి ప్రోత్సహించాలని నా ఆశ!

ఇట్లు

మీ అభిమాన రచయిత

**విశ్వేశ్వరరావు**

# తారాపదము

| పురుషులు | స్త్రీలు |
|---|---|
| 1. పోతన—కథానాయకుడు | 7. ధర్మాంబ—పోతన్న భార్య |
| 2. శ్రీనాథుడు—పోతన్న బావమరది | 8. శారద—శ్రీనాథుని కుమార్తె |
| 3. సర్వజ్ఞసింగభూపాలుడు (కర్ణాటకభూపాలుడు) | 9. గిరిజ—పోతన్న కుమార్తె |
| 4. మల్లన్న—పోతన్న కుమారుడు | 10. భోగిని |
| 5. చిదానందయోగి | |
| 6. రాజభటులు | |



## బృందగానం

పాహి పాహి జననీ !
పాహి పాహి జననీ !!

ప్రవిమల చరిత పునీతా మాతా
కవిజనసన్నుత సుగుణా భరణా !

పాహి పాహి జననీ !
పాహి పాహి జననీ !!

గంగా యమునా కావేరీజల
ఘనతర శోభిత భారతమాతా
శూరసమేతా వినుతా మాతా !

పాహి పాహి జననీ !
పాహి పాహి జననీ !!

# భక్తపోతన

## ఒకటవ రంగము.

శ్రీనాథుని యిల్లు: ప్రవేశం—పోతన్న చేతిలో పుస్తకంతో.

పోత :—బావగారు వ్రాసినపుస్తకం ! (చూచి) వీధినాటకమట బహుతమాషాగావున్నదే పేరు – పద్యాలు రెండుచదువుదాం ! (పేజీ తిరగవేసి)

సీ. సొగసు కీల్జడదాన సోగకన్నులదాన !
వజ్రాలవంటి పల్వరుసదాన !
బంగారు జిగిదాన బటువు గుబ్బలదాన
నయమైన యొయ్యారి నడలదాన !
తోరంబుగటిదాన తొడల నిగ్గులదాన
పిడికిట నడుగు నెన్నడుముదాన !
తళుకు చెక్కులదాన ! బెళుకు ముక్కరదాన !
సింగారి కన్నొప్పు చెలువుదాన !
గీ. మేలిమి పసిండి రవకడియాలదాన !
మించిపోనేల రత్నాల మించుదాన !
తిరిగిచూడవె ! ముత్యాలసరులదాన !
చేరి మాటాడు చెంగావి చీరదాన !

(పేజీ తిరగవేసి)

సీ. చక్కని నీ ముఖ చంద్రబింబమునకు
కళ్యాణమస్తు ! బంగారుబొమ్మ
నిద్దంపు నీ చెక్కుటద్దపు రేఖకు
నైశ్వర్యమస్తు ! నెయ్యంపుదేవి

మీటిన బగులు నీ మెఱుగు పాలిండ్లకు
సౌభాగ్యమస్తు! భద్రేభయాన!
వలపులు గులుకు నీ వాలుగన్నులకు న
త్యధిక భోగోస్తు! పద్మాయతాక్షి!

గీ. సఘురి పుమాపాల్కు నీ సుమ్మమాటలకును
నైభవోన్నతిరస్తు! లావణ్యసీమ!
వన్నెచెన్నెలుగల్గు నీ మన్ననలకు
శాశ్వతస్థితిరస్తు! యోషాలలామ!

(ఎదురుచూచి) అదుగో! నా ప్రేయసి ధర్మాంబ యిటే వచ్చు చున్నది—

(ప్రవేశము: పోతన్నభార్య ధర్మాంబ.)

పోత:—ధర్మాంబా! ఏం అలా ఖిన్నంగావున్నావు!

ధర్మా:—ఖిన్నంకాకపోతే యేముంటుందిలెండి! నా బ్రతుకు యింతేకదా (విచారము)

పోత:—అలాకాదు - ధర్మాంబా! నీ విచార కారణం చెప్ప కూడనిదా?

ధర్మా:—చెప్పకూడ కేం - నిక్షేపరాయడులా చెప్పచ్చు!

పోత:—చెప్పాదూ - చంపక!

ధర్మా:—నాకో సందేహం వుందండి!

పోత:—యేమిటా సందేహం?

ధర్మా:—ఏవిటా! మా అన్నయ్య శ్రీనాథం పెద్దకవీశ్వరు డయ్యాడు. రాజాశ్రయం సంపాయించుకొన్నాడు. రత్నరాసులతో తులతూగుతూవున్నాడు. యించకా— మీరూ కవీశ్వరులయితే మీకూ రాజాశ్రయంవుంటే నే నీగా మూసివాయనపు పేరంటాలులాగ వుండక పోయేదాన్ని - (విచారించును)

పోత:—వెట్టిదానా! యిదా నీ ఆందోళన! లేనిపోని శంక లతో మనస్సు పాడుచేసుకోకూడదు. నిజమే - మీ అన్నయ్య కవి

రాజుఅయ్యాడు. రాజాశ్రయాన్ని సంపాదించాడు. సర్వసంపదలతోనూ తులతూగుతూవున్నాడు. మరి నేనంటావా? నాకూ కవిత్వంవచ్చు. పద్యాలు వ్రాస్తా. నా పద్యాలు నాకేకాని యింకోడికి వినిపించను. అదోబాణీ కవిత్వం నాది. యిదిగో కవిత్వంవస్తే యేముందే గ్రహబలంవుండాలి – ఆ పైన యీశ్వరకటాక్షంవుండాలి!

ధర్మా :—యీ మెట్టవేదాంతలకేంగాని నేనోపని చెబుతా. చేస్తారా?

పోత :—తప్పక చేస్తానన్నానుగా – ఏవిటా పని.

ధర్మా :—యేమీలేదు – మా అన్నయ్య నచ్చేవేళయింది (ఎదురుగాచూచి) అదుగో వస్తున్నాడుకూడా! ఆయనతో మీ కవితాశక్తినిగురించి భట్రాజులా పొగుడుతా. ఎలాగయినా రాజాశ్రయం సంపాయించే వుపాయం చూపించమని అడుగుతా. మీరుకూడా మా అన్నయ్యతో పెడసరంగా మాట్లాడక వినయంగా అడగాలి.

పోత :—అలాగే – తప్పక అడుగుతాను తప్పేముంది. ఆశ్రయంలేని లలనాసౌందర్యం – అండలేని లతావితానం – పరిచయప్రాబల్యంలేని పాండిత్యము శోభించవు అన్నారుకదా పెద్దలు. ఇప్పుడే అడుగు. రాజానందముతో నీకు ఆనందవర్షాన్ని కురిపిస్తాను – సరేనా!

(ప్రవేశం—శ్రీనాథుడు)

శ్రీ :—ఏం – చెల్లీ – బావ తీసికొని వెడతానంటున్నారా.

ధ :—లేదు అన్నయ్యా! ఆయనకో కోరికవుంది – నువ్వే తీర్చాలి!

శ్రీ :— ఏవిటి బావా - ఆ కోరిక.

పో :—ఆమెనే అడగు–

శ్రీ :—సరె - నీవే చెప్పుచెల్లీ!

ధ :—ఏం లేదన్నయ్యా! ఆయనకూడా కవీశ్వరులేగా! నీకు తెలుసుగా!

శ్రీ :—తెలానూ!

ధ :—సీతోపాటు - రాజదర్బారుకుపోవాలని ... ...

శ్రీ :— ఇంతేనా - బావా - యీమాత్రానికేనా నీ సిగ్గు. తప్పక నిన్ను సర్వజ్ఞసింగమనీని సందర్శనానికి తీసికొనిపోతాను. ఆ మహనీయుడున్నాడు చూశావా - కావ్యకళావేత్త - నిరుపమాన యశోధనుడు - ప్రజాహితైకవాది. ఆతని సందర్శనము నీకు సకల వాంఛాఫలసిద్ధి! అతని ప్రతిభ వర్ణనాతీతము బావా!

సీ. పసిడీక తిసిబూని పగతుర చెండాడి
కదనభూమిక కాలు కదుపునపుడు
విజయలక్ష్మిసిబట్టి వీర్యశౌర్యము మీర
జయగానము న్చేసి సాగునపుడు
తనరాష్ట్రజనులలో దైన్యమేలేకుండా
జాలితో పాలన జరుపునపుడు
కవిరాజులన్గాంచి కారుణ్యమేసార
బహుమానములిచ్చి బంపునపుడు
గీ. దీనభావాల సరయని తెలుగువారు
ఎంతతపమాచరించిరో యెఱుగననుచు
కాంచి గర్వించుచుందును - కల్లకాదు!
బావ! సర్వజ్ఞసింహుడు - ప్రథితమూర్తి!

అంతేకాదు బావా! కళాభిజ్ఞత అతని సొంతసొమ్ము—

సీ. గాయకు గొంతులో కమ్మనిరాగాల
రుచిచూడగల నేర్పు లొందనైన
చిత్రకారుని కుంచె చిలికించు సౌందర్య
మభినుతించెడి ప్రాభవమునైన
కవిరాజు గంటంబు కల్పించు మాధుర్య
భావాల ప్రతిభను పలుకనైన
కాలిగజ్జయలన్ని ఘలుఘల్లుమనిమ్రోయ
నర్తనకీవిని నడుపనైన

గీ. తగినవాడబ్బ - యీతని మొగములోనె
వాసమొనరించు గీర్వాణి హాసమెలయ !
సహజసౌందర్యరాశి - భూజానికాడకు
వచ్చుటకు సందియంబేల బావ ! నీకు !

పో:—బావా ! నీవు చెప్పినట్లుగా సర్వజ్ఞసింహుడు సరసుడనియే విన్నాను. మీ చెల్లెలుకూడా రాజదర్శనము చేయమని ప్రోత్సహించుచున్నది. నీవుకూడా రాజాశ్రయసంపన్నుడవుకదా ! యీరీతిగ మీ చెల్లెలికోరిక నెరవేర్పనెంచినాను.

శ్రీ:— ఔను. బావా ! మా చెల్లెలి సలహా చాలాఅమూల్యమైనది. కవి అపరబ్రహ్మ, సృష్టికి ప్రతిసృష్టి చేయగలనేర్పు అతనిలో వుంది. పాషాణహృదయాలను ద్రవీభూతంచేసే ఘనతరశక్తి కవికి అమ్ముడైపోయింది. అలాంటి ఉత్తమజన్మ అలభ్యంకాదూ - బావా ! కవిగా జన్మించడమే కష్టం - తన కావ్యాలను విని ఆనందించి ఆదరించే ప్రజలో, ప్రభువో దొరకడం కష్టతరం - సర్వజనాకర్షణీయంగా కావ్యసృష్టిచేయడం కష్టతమం - యీ పరిస్థితిలో చక్కగా కవితాగానం చేయగల నీవు - రాజాశ్రయాన్ని పొందడంకన్న కావలసినదేమున్నది బావా ? కవిఅనే బిరుదు సిటికాకికి లేదాబావా - అంతా కవులము గామా - యెంతైనను కందపద్య మల్లగలేమా అన్నట్లు అందరూ కవులేనా—

సీ. పరువు గోల్పోయిన బానిసహృదయాల
స్వేచ్ఛను పురికొల్ప జేయువాడు
కాలగర్భంబులో కలసిపోయిన ఖ్యాతి
తిరిగి యీ జాతికి దెచ్చువాడు
ఆటలై పాటలై అలరారు ప్రతిభను
కన్నుల కెదురుగా కట్టువాడు
రక్తనాళములందు ప్రవహించు భీతికి
కావ్యాలమందును గన్నవాడు.

గీ. సంఘ దౌర్జన్యములజూచి చాటువాడు
జాతి కాధారనుగురీతి జరుగువాడు
కవివరుడుగాక – జగతి నొక్కరుడుగలడె!
ధరణి నూహింప సత్కవి ధన్యజీవి!

కాబట్టి - ధర్మాంబా! బావను రేపే రాజదర్శనార్థం తీసికొని వెడతాను – యేం బావా!

పో:— అలాగే – తప్పక పోదాం.

(నిష్క్రమణ)

△

# రెండవ రంగము

సర్వజ్ఞసింహుని భోగ్యగృహము—(ప్రవేశం—సర్వజ్ఞసింహుడు భోగిని—ప్రక్కనేయింకా కొన్నికుర్చీలు వుంటాయి.)
భోగిని నృత్యంతో రంగప్రారంభం–
సర్వజ్ఞుడు సింహాసనాసీనుడై వుంటాడు.

నృత్యగీతం.

ఆనందమె కోరుము! పరమానందమును గాంచుము
తేనియ లూరేటి తీయని గేయాల
గానమాధురితోడ కాలము గడుపుము!
మిసిమియౌవన సిరుల మేదినినలరుము
మేటి సరసాలాడ మించిగమించుము!
చీకుచింతల మరచి చిద్విలాసమునెంచి
స్థిరతర సౌఖ్యముజెందగ లెమ్ము.

సర్వ:—(నృత్యానంతరం) భోగినీ–నీ నాట్యకళా ప్రవీణచాలా స్తుత్యమైందిసుమా! నిరుపమాన అభినయ కౌశలము నీలో నిబిడీకృ

తమై ప్రేక్షకహృదయాలకు అమితానందాన్ని అందిస్తూంది. నీ నాట్య సన్నివేశాలకు నటరాజుకూడా విస్మయుడౌతాడు!

భోగి :—కళాభిజ్ఞులు - యశశ్రీసమేతులు - మీవంటిప్రభువుల సన్నిధిని నర్తనచేసి మన్ననల నందిన మీ చరణదాసి కడుంగడు ధన్యురాలు ప్రభూ!

సర్వ :—సెబాస్! నీ కళాసంపన్నతకు యేకానుక కానలెనో కోరుకొనుము—నీ అభీష్టసిద్ధికై రాజాజ్ఞ వేచియున్నది.

(సేవకుని ప్రవేశము)

సేవ :—ప్రభూ! కవిసార్వభౌములు శ్రీనాధులరాక! సెలవా!

సర్వ :—వారిని సత్వరప్రవేశపెట్టుము.

(సేవకుని నిష్క్రమణ)

(మరికొంతసేపటికి శ్రీనాధ - పోతన్నలు ప్రవేశము)

శ్రీనాధ :—సర్వజ్ఞసింగభూపాలా! ఇవే శుభాకాంక్షలు.

సర్వ :—(నిలిచి) మీ రిరువురు సుఖాసీనులుకండు.

(కూర్చుందురు.)

సర్వ :—కవిసార్వభౌములు మా భోగినీగృహమును పవిత్రపఱచినారు మా ధన్యవాదములు.

భోగి :—కవిరాణ్మణికి మా నమస్కృతములు.

సర్వ :—వీ రెవ్వరో తెలియజేతురా? (పోతన్ననుచూచి)

శ్రీ :—చెప్పవలసిన విషయమునే అడిగినారు - అందులకే గదా! వెనుక నే చెప్పితిని—

కం॥ సర్వజ్ఞ నామధేయము
శర్వునకే రావుసింగ జనపాలునకే
యుర్విం జెల్లును నితరుని
సర్వజ్ఞుండనుట కుక్క సామజమనుటే!

సర్వ :—కవిరాజులు సమర్థులు. తిమ్మిని బమ్మినిగా చేయగల నేర్పరులు - మీ ప్రతిభను వర్ణించుటకు నేను కడు అసమర్థుడను. మరి వీరి సంగతి ...

శ్రీ :—మహారాజా ! యీయన మా బావగారు. ఇంటిపేరు బమ్మెరవారు. పేరు పోతరాజు. యువకుడు. ఉత్సాహవంతుడు–కావ్య కళాభిజ్ఞుడు. రసోపాసి !

సర్వ :—భోగినీ ! నేడు సుదినము – నీ మందిరమున మరొక కవిమాన్యుని కన్నులపండువగాగంటిని – యిక వీనులవిందుగా వీరి కావ్యగానమాలకింతము—

భోగి :—మహాప్రసాదము—

సర్వ :—పోతనమహనీయా ! మీ సందర్శనము మహానందదాయకము. కవీశ్వరుని గంటమునకూ - గాయకుని కమ్మని కంఠమునకు (భోగినివైపు చూచి) యీ మా భోగిని నాట్యమునకు నా శరీరము మ్మొక్కడై పోయినది – మీ బావ శ్రీనాథకవిపుంగవులతో బాటు మీరు కూడ మా దర్బారున కావ్యగానముచేయుట మా కెంతయుసమ్మతము_

పో :_మహారాజా! మీ అనన్యసామాన్య ప్రేమకు సదాకృతజ్ఞుణ్ణి

సర్వ :—భోగినీ – యీ నాటి కార్యక్రమము యెట్లుఆరంభించ మందువు !

శ్రీ :—మహాప్రభూ ! ఎట్లనుటయేల ! భోగిని నృత్యముతోడనే గదా !

సర్వ :— భేష్ – తొలుత భోగిని నృత్యము – అటుపైన ?

భోగి :— అటుపైన శ్రీనాథకవివరుని శృంగారపద్యపఠన.

సర్వ :—ఔను – ఆ పైన మన కొత్తకవిగారు పోతనామాత్యుల యీ భోగినిపై దండకపఠన – బాగున్నదా !

శ్రీ :—ప్రభువుల ఆజ్ఞకు వేరున్నదా !

సర్వ :—మీ బావగారు – మౌనము వహించినారే – ఆ యిష్టమా ?

శ్రీ :—కాదు - యెప్పటికీకాదు - మీ తలవు ప్రకారం - భోగినీదండకమునకు మా బావ ఉద్యుక్తుడై వున్నాడు. (పోతన్నతో) యేం - బావా !

పో :—మీ ఆజ్ఞల కన్యథాగలదా !

సర్వ :—భోగినీ - మరి నీ నృత్యగానవినోద మారంభింతువా!

భోగు :—చిత్తం - నమస్కరించి (నృత్యము చేయును)

నృత్యగీతము.

వలపో! వలపో ! వలపో ! వలపో !
కులుకుల కూర్చే గురుతర మైనది
నిలకడ సౌఖ్యము నింపేమేటిది
వలపో ! వలపో ! వలపో ! వలపో !
త్యాగముతో తనరారెడిది
భోగాశ్రయమును పొందినది
వలపో ! వలపో ! వలపో ! వలపో !

(మరికొంతసేపటికి నృత్యసమాప్తి)

సర్వ :—శ్రీనాథకవిరాజా ! యీ భోగిని తన నాట్యానైపుణ్యముతో మన మేనుల మఱపింపచేయుచున్నది. యీ కళాభిజ్ఞతకు తగిన కానుక మన పోతరాజుగారి భోగినీ దండకమే !

శ్రీ :—ఔను ప్రభూ ! యీ కాలిగజ్జెలసొరు - యీకిన్నెరసాని సొయలు చిరస్థాయిగా శిలాక్షరములుగా మనపోతన్న భోగినీదండకమున మేర్పర్చు కుంటాయి ! భౌతిక దేహమైకన్న యీ యశశ్శరీరముతో యీలలనామణి ఆంధ్ర దేశచరిత్రలో చిరంజీవియై యుంటుంది!

సర్వ :—ఔను - మీరు యదార్థమునే వచించినారు. యీ భోగినికి యీ భోగినీదండకమే మా కానుక !

భోగి : — ప్రభువుల కరుణాకటాక్షములకు యివే మా కృతజ్ఞతాభివందనాలు. మరి - శ్రీనాథకవిపుంగవులు - తమ పద్యపఠన మారంభింతురా !

సర్వ :—శ్రీనాథకవిరాజా—మీ వీధినాటకమునందలి చక్క-నిపద్యమును వినిపించి వీనులపండువ సేయించెదరా!

శ్రీ :—తప్పకప్రభూ! వినుడురా!

సీ॥ తళుక్కుతళుక్కనుకాంతి బెళుక్కు కెంపులముంగ
రందమై కెమ్మోవి యందుగుల్క
ధగధగద్ధగలచే దనరారు బంగారు
గొలుసులింగపుకాయ కొమరుమిగుల
నిగనిగన్నిగలచే నెగడు చెల్వపుగుబ్బ
దోయి యొండొంటితో రాయడింప
రాజహంసవిలాస రాజితంబగుయాస
ముందు మట్టెలు రెండు సందడింప

గీ॥ సరసదృక్కుల విటులను గరగజూచి
పొందికైనట్టి మోమున భూతిరేఖ
రాజకళలొప్ప నద్దంకి రాజవీధి
బోలిచె నొకకొమ్మ – గాజుల ముద్దుగుమ్మ!

సర్వ :—పదములపొందిక – భావాల సొగసు – కావ్యగానమున కంఠమాధురి – యీ శ్రీనాథుల సొంతసొమ్ముగదా – మీ వంటి మహనీయులు మా ఆస్థానీయులుగానుండుట మా రాజ్యమునకే భూషణముగదా!

శ్రీ :—మీ ప్రశంసకు తగను మహారాజా! ఎందువల్లనందురా ఆఢ్యుడనే వాడున్నప్పుడు అందరకూ పూజ్యతవుంటుంది. లెక్కమీద సున్న కెక్కినట్లుగా! ఆఢ్యుడు అనేవాడు లేసినాడు అందరూ పూజ్యతావిహీనులే అవుతారు – లెక్కలేక సున్న కేగినట్లు – మీ వంటి ప్రభూత్తముల ఆదరాభిమానములుంటేనే చాలు – మహారాజా – కవితకమ్మని వాసనను గుబాళింపచేస్తుంది.

సర్వ :—మంచిమాటలనే శలవిచ్చారు – మరి మన పోతరాజుగారు తమ భోగినీ దండకమును వినుపింతురా!

శ్రీ :—బావా ! ఆరంభించెదవా ! ఆశుధార !

సర్వ :—ఆశుధారగా తమ కవిత్వమును రుచి చూపించినచో దండక శేషమును తీరికగా పూర్తి చేయవచ్చును.

శ్రీ :—అవును - బావా ! ఆరంభించెదవా !

పో :—(ఆశుకవిత్వము చెప్పినట్లు మెల్లిగా - తీరికగా పద్యం చదవాలి.)

ఉ. పండితకీర్తనీయుడగు బమ్మెరపోతన యాసుధాంశు మా
ర్తాండకులాచలంబుసిధి తారకమై విలసిల్ల భోగినీ
దండకమున్ రచించె బహుదానవిరక్తకు రావుసింగ భూ
మండల భర్తకున్ వినుత మానవాధమదాపహర్తకున్.

సర్వ :—సెహబాస్ శ్రీనాధకవిరాజా ! మీ బావగారి కవితా శక్తికూడ మధురాతిమధురముగ నేవున్నది - కాబాభోగినీ !

భోగి :—మీరు ఔనన్నదానిని కాదనుట కెవరికైన తాహతున్నదా ప్రభూ ! బావనుమించిన బావ మన అదృష్టవశమున లభించినారు.

సర్వ :—నిక్కము వచించితివి భోగినీ - యీ పోతరాజకవి కూడ మన దర్బారున భూషణప్రాయముగా నుండదగినవాడు. యిప్పుడే పోతరాజుకవికి బహుమానములనిశి భోగినీదండకసమాప్తి చేయుమని ప్రార్థించెదను.

శ్రీ :—యీ పాటిదానికి ప్రార్థన లేల మహారాజా ! మీ అనుగ్రహపాత్రమైన అతని కవిత శోభాయమానమేగదా !

పో :—మహారాజా ! మీ అనుగ్రహమున్న నంతియేచాలు. మీ ఆజ్ఞానుసారముగ భోగినీదండకం సమాప్తిచేసియే మా యింటికి పోదును.

శ్రీ :—బాగున్నది. బహుచక్కగా చెప్పినావు.

సర్వ :—పోతన్నగారూ ! మీ కావ్యకృషికి నేను యే త్యాగమయినా చేయడానికి సంసిద్ధుడనై వున్నా - యింకమనమీ సభచాలించి రాజమందిరమునకు పోదము. (నిష్క్రమణ)

# మూడవరంగము

మధ్యేమార్గము—ప్రవేశము – చిదానందయోగి.

గేయం.

బ్రతుకు మర్మము తెలియరా
వెతకు నాహుతికాకురా!
ఆశలకు బానిసవుగా
అవనిలో తిరుగాడగా
యేలరా శాశ్వతసుఖానికి
యింతవంతలు మానవా!
బ్రతుకుమర్మము తెలియరా
వెతకు నాహుతి గాకురా!
మాయకన్నుల మసకచూపులు
మోసపడి పోనేలరా
సత్యమును శాశ్వతము నెఱుగగ
సాధనము జేయర మానవా!
బ్రతుకుమర్మము తెలియరా
వెతకు నాహుతి గాకురా!
యౌవనము క్షణకాలమూ
అతివపై వ్యామోహమూ
విడనాడుమూ పరమార్గమూ
కడజేర్చుమూ భవబంధమూ!
బ్రతుకుమర్మము తెలియరా
వెతకు నాహుతి గాకురా!

చిదా:—ఆహా! ప్రపంచమంతా ఆశాపాశముచే బంధీభూతమై యున్నదిగదా! కాంతాకనకములకోసమై ప్రతిమానవుడు మెం

తో తాపత్రయపడుచున్నాడు తన కాంక్షలు నెరవేర్చుకొనుటకై న్యాయాన్యాయ విచక్షణచేయడు ఔరా! ఊరూపేరూలేక గగన మందెచ్చటో లీనమైయున్న యీ జీవుడు—ఒకవూరిలో ఒకపేరుతో ఒకశరీరమునందు బంధింపబడుటవలన ! గదా యీ అరిషడ్వర్గములు యీ నవరసములు- యీ షడ్రుచులు వానినావహించి మోసగించుచు న్నవి. మానవుని జననమే ఒకనాటకరంగము - మానవుని బాల్య యౌవన కౌమార వార్ధక్యములే వివిధ నాటకరంగములు - పరమేశా! నీ సృష్టివైపరీత్యము వర్ణింప నలవికాదుసుమా!

గేయం

రాముని గనవేల! సుశీల! రమ్యుని గనవేల!
కామములోబడి కర్మకు హాడలి
కాంచనచేలుని గనవా జీవా! ॥రా॥
దశరథనందను దనుజవిభంజను
దాసోహమ్మనలేవా జీవా ॥రా॥
నిర్మోహముగా! నిశ్చలంబుగా
ధర్మాత్ముని దరి జేరవమానవ॥
(మరికొంతసేపటికి ప్రవేశం - పోతన్న.)

(సర్వజ్ఞసింహుడిచ్చిన భూషణాంబరాలతో పోతన్న హాడావి డిగా పురోగమించుచుంటాడు. చిదానందయోగిని చూచి - అతని కాషాయవస్త్రములను రుద్రాక్షసేరులను ఆ తత్వగీతికను విని నిలబడి యుంటాడు)

పో :—మహాత్మా ! మీ దర్శనభాగ్యమున ధన్యుడనైనాను.

చిదా :—కుమారా ! నీ పెసరవో యెరింగింతువా !

పో :—నన్ను బమ్మెర పోతరాజందురు - మీ రెరిగియేయుం దురు ! కవిసార్వభౌమ శ్రీనాథుని బావమరదిని—

చిదా :—శ్రీనాథకవి - బావమరది - పోతన్నవు నీవేనా ?

పో :—ఔను స్వామీ

చిదా :—ఔనుకాని బిడ్డా ! యేమిటీ హడావిడి ?

పో :—హడావిడికేముంది స్వామీ - యేదో ఉదరపోషణ ! దానికేగదా యీ తొట్రుపాటు ?—

చిదా :—ఉదరపోషణకు నీ వెంతుకయ్యా తొట్రుపాటు - బ్రతుకవలెనని బ్రతికినవారున్నారా ? చనిపోవలెనని గతించినవారున్నారా ? వచ్చుట - పోవుట - తినుట - తిరుగుట - ఆనందించుట - అటమటించుట - సర్వమూ పరమేశ్వరాధీనముగాదా ?

పో :—ఔను - మీవంటి మహర్షియులతో వాదించుటకు నే నెంతటివాడను మహాత్మా ?

చిదా :—పోతనామాత్యా ! వాదమునకేమున్నది - నా కొకటే విచారమున్నది.

పో :—నన్ను గురించా - ప్రభూ ?

చిదా :—కాదు కుమారా ! ప్రపంచమే పాపపంథాను నడక సాగించుచున్నది—

పో :—అట్లు దేవా ?

చిదా :—

సీ. తన వలపురాణి తనివిదీరుటకును
అన్యాయమరయని యధముడొకడు !
తన జీవయాత్రను తీరింపజేయంగ
ధర్మంబునెంచని కర్మియొకడు !
తన కోరికలు దీర్చుకొనునట్టి యాసతో
పరులను తలగొట్టు పాపియొకడు
తన క్షేమమును గోరి తక్కినవారిని
చంపించనేగు పిశాచియొకడు
గీ. ఇటుల సాగుచునున్నదీ యైహికంబు
ధర్మమర్మాల నెరిగెడి దారిలేమి

పరహితంబును చూచెడి వాంఛ లేదు
యెందుకో గాని వీరల కింతకాంక్ష ?

అవకాశముచాలని యీ అల్పాయువుతో హరినామస్మరణ చేయుటకే మనసొప్పదు కాబోలు—

సీ. పాలనవ్వులతోడ పవళించు శిశువితో
ప్రమదంబునిడు పసిపాపయగుచు !
వచ్చియు రానట్టి భాషణంబులతోడ
లీలల చూపించు బాలుడగుచు !
యుద్యోగిగాభార్య కుత్సాహమిడు
మహితాంగుడనట్టి కౌమారుడనుచు !
అవయవంబులకెల్ల జనసత్వములుబోవ
ముక్కుచున్ మూల్గెడి ముసలియగుచు

గీ. నాట్యరంగమునన్ జీవి నడచి నడచి
యెప్పుడోగాని - ఎక్కడో - చెప్పలేనక
పాడుదేహము విడనాడి పరుగులిడును
మాయ బ్రతుకంతతోడ సమాప్తిజెందు !

పో :—మహాత్మా ! మీ మాటలు నా అంధకారజీవనమునకు వెలుగు బాటలుగా వున్నాయి ప్రభూ !

చిదా :—కుమారా !

సీ. కైతక్కలాడెడి తరుణులకోసమె
సిగ్గనుమాటను జేరనీక
పరవనితయనక సరసాలనాడగా
పాపభీతికి నుంత చూపులేక
పరధనంబందు బే ప్రాధాన్యమన్నట్లు
ఆత్మాభిమానమ్ము నరయలేక
ఆధిక్యుడవటంచు అధమాధముపొగడ
గుణశీలనముజేయు గోర్కెలేక

గీ. ఈశ్వరునిలీల రవ్వంత నెఱుకవడక
మూఢులైనారు - ఎఱుగరే ముందుముప్పు!
విశ్వమండలి యీ రోజె! శాశ్వతంబె!
మాయకలి - ముంచినాడె! సన్మార్గసరళి!

పో:—ప్రభూ! మీ హితబోధ నాకు పరమౌషధముగానున్నది.

చిదా:—కాని - కుమారా! నీకీ భూషణాంబరము లెక్కడివి?

పో:—ప్రభూ! అదొక్క పెద్దగాథ.

చిదా:—చెప్పుము - వీనులవిందుగా విందును.

పో:—గురూత్తమా! నా భార్యకు కనకకాంక్ష జనించింది దానికి హేతువు రాజాశ్రయసంపన్నులై - సకలవైభవోపేతులైన మా బావ శ్రీనాథుని గృహమందు మే నుండుటయే!

చిదా: - బాగున్నది - తరువాత?

పో:—ఒకనాడు నా ధర్మపత్ని నన్నుగూడ రాజాశ్రయమును సంపాదించమని ప్రోత్సహించినది - మీ దయవల్ల - నాకుకూడా కొంత కవితాశక్తి లభ్యమైంది - ఆ మరునాడే సర్వజ్ఞసింగభూపాలుని సందర్శనార్థము మా బావతో రాచనగరికి ప్రయాణమైనాను —

చిదా:—మంచిది - పిమ్మట?

పో:—సరాసరి రాజమందిరమునకుగాక సర్వజ్ఞసింహుని భోగ్య గృహమునకు బావ గొంపోయినాడు - అక్కడ రాజు తన భోగినితో సరసములాడుచున్నాడు —

చిదా:—మంచిసమయమునకే పోతివి పోతన్నా!

పో:—ఏమిచెప్పనుస్వామీ - బావ నన్ను రాజావారికి పరిచయం చేసినారు. ముందర భోగిని నృత్యమూ - పిమ్మట మా బావగారి పద్యపఠనము పూర్తి అయింది.

చిదా:—మరి నీ వేమిచేసినావు?

పో:—నన్ను ఆ భోగినిమీద ఆసుధారగా దండకము వ్రాయమని ప్రభువువారి ఆజ్ఞ అయింది.

గీ. ఇట్టివీరులగన్నట్టి మట్టియందె
పుట్టినాడవు నీ పూర్వపుణ్యమనగ
శీలమెఱుగక స్తోత్రాల జేసినావు!
'ముండి' మీదన నీపుణ్య దండకంబు!

నాఋషిః కురుతే కావ్యమన్నారుగదా పెద్దలు. ఋష్యైంతే వుంటే నేకాని కవికాలేడు. అలాంటి మంత్రపునీతమైన యీ మహత్తర కవితాశక్తిని ఒక భోగసుఖప్రాప్తికై వ్యయపరచి యిహసుఖము నర్థించుచున్నావు – యిదియే శాశ్వతమని మురియుచున్నావు – యీ సర్వజ్ఞుడే జగత్ప్రభుడని భ్రమపడుచున్నావు – పోతన్నా నీ కవితాశయం యిదికాదు – నీ ప్రజాప్రబోధనమార్గం యిదికాదు – ఎంతపాపాత్ముడవైతివోయీ!

పో: – గురుదేవా! నిజమెరిగితిని – నన్ను కాంక్షలో [illegible] మార్గమును వీడితిని – నా జీవితము వ్యర్థపరచితిని – నా పవిత్రశీలము – నా సుఖమును – ధనార్జనకై వదలినాను – స్వామీ – నా దోషము మన్నించరా? నాకు ఇప్పుడు నా ధర్మమునకు ప్రాయశ్చిత్తమేదైనా చెప్పరా?
(పాదములు పట్టుకొనును)

చిదా: — కుమారా! మానవునకు పశ్చాత్తాపమే అంతిమం – పశ్చాత్తప్తుడైనవానికి పాపఫలితము లేదు – నీవుచేసిన మహాపాపము నకు యీ పశ్చాత్తాపముచాలును – నీ భావిజీవితమునుమార్గముగా దురాశల దుఃఖపడకుండునట్లు – తెలుసుకో-పోతనా, (లేవనెత్తును)

పో: — స్వామీ! తెలియకచేసిన యపరాధముల మన్నింపుడు నా జీవితమునకు మీ తిరుమంత్రమే రామరక్ష. మీ యుపదేశానుసారముగా నే చరించనెంచితిని – నన్ననుగ్రహింపుడు.

చిదా: — అనుగ్రహించువాడు దేవుడు – నేనా వెఱ్ఱివాడా! జగత్ప్రభువు రాముడు! రామాంకితము పవిత్రము – మానవులు కామ క్రోధ లోభ మోహ మదమాత్సర్యములతో సత్యపదార్థమును గుర్తించలేకున్నారు నాయనా!

పో:— స్వామీ!

చిదా:— నీవుచేసిన భోగినీదండకమువలన మంత్రపూతమైన కావ్యశక్తి అపవిత్రమైనది. ఈ పాప పరిహారార్థము – భగవత్సంకీర్తనమును కావ్యరూపమున చేయుము – దానితో నీ పాపము పోవును – భాగవతమును వెంటనే వ్రాయుము.

పో:— అసమర్థుడనైన నేను కావ్యరూపమున భాగవతము రచింపగలనా స్వామీ!

చిదా:— ఇటురమ్మా. (పోతన్న దగ్గఱకు వచ్చినపిదప చెవిలో రామమంత్రోపదేశం చేస్తాడు) నీవు రచించే భాగవతమును శ్రీరామార్పణచేయుము. ఆ రామభద్రుడే నీచే భాగవతము పలికించుచున్నాడు – నీకు భవహారిణమైన ముక్తిమార్గమైన యీ దివ్యరచనమునకు శ్రీకారము సిద్ధము – వెంటనే శ్రీనాథగృహమును విసర్జింపుము – ఏకశిలానగరమున కేగుము. సజ్జనసమేతుడవై కర్షకవృత్తిననుసరించుచు బ్రహ్మానుభూతి నందుము. ప్రకృతిసౌందర్యము ననుభవించి – పరమేశ్వరధ్యానివై భాగవతమును రచించి ఆంధ్రభారతికి ఆభరణము నిచ్చెదవుగాక.

పో:— మహాప్రసాదం.

ఉ. ఆశకు హద్దులేదు! పరమాత్మ నెఱుంగనీ మాటలేదు! ఆ
వేశము చావలేదు! పృథివీస్థలికోర్కె పీడలేదు, యీ
పాశములందు చిక్కితిని! స్వర్గసుఖంబుల నెంచలేక! స
ర్వేశ! శమింపరావె నను! వేడుచునుంటి సునిశ్చితంబుగన్.

గీ. కటికిచీకటి బ్రతుకుకు కాంతినొసగి
జ్ఞానభిక్షనొసంగిన స్తవ్యమూర్తి!
భవ్యబోధకు నే ఋణపడితి సామి
శిష్యపమునిగ స్వీకృతి జేయరయ్య!

(నిష్క్రమణ)

∆

# నాలుగవ రంగము

శ్రీనాథ గృహము - ప్రవేశము - ధర్మాంబ - మల్లన.

మల్ల :—అమ్మా - రాత్రి సరిగా నిద్దర పట్టటంలేదమ్మా

ధర్మా :—ఏం నాయనా ?

మల్ల :—నిన్నరాత్రి యేదో కునుకుపట్టిందంట - ఒక భీకర స్వప్నం వచ్చిందమ్మా.

ధర్మా :—ఏమిటాకల నాయనా

మల్ల :—సంతోషంగా నాన్నగారు రాజకానుకలతో వస్తూంటే దారిలో యెవరో బూడిద బుచ్చన్న ఆయనకు ఏవేవో మాటలు చెప్పి ఆ భూషణాలు కాజేసినాడటమ్మా—

ధర్మా :—వెర్రివాడా ! కలలు కల్లలురా ! రాజసన్మానమునందు ఒంటరిగా వస్తారా - సామాన్యులలె - భూషణాంబరాలతో పరివారసమేతంగా రాచమర్యాదలతో వచ్చే మీ నాన్నగారికే యే భయం లేదు చిట్టితండ్రీ—

(ప్రవేశం—శారద)

శా :—అత్తయ్యా ! మావయ్య వస్తున్నారు.

ధర్మా :—ఆహా - వస్తున్నారా ?

(ప్రవేశం - పోతన్న ఖిన్నంగా)

యేమండీ - అలా విచారంగావున్నారేం - రాజాశ్రయం లభ్యం కాలేదా - మీ కవిత ప్రభువుకే రుచించలేదా (దగ్గఱగాజేరి) మాట్లాడరేమండీ—

పో :—(మౌనంగా అటూ ఇటూ తిరుగుతాడు)

ధర్మా :—ఇదినా ప్రారబ్ధంకాబోలు—పలుకే బంగారమయింది.

పో :—(ఆవేశంతో) ధర్మాంబా ! స్త్రీబుద్ధిః ప్రళయాంతకః అన్నారు. నీ సలహాయే నా కొంపముంచింది. నీమాటలేనా అభ్యుదయ

జీవిత పరంపరకు కత్తికోత అయినది. అందువల్లనేకాబోలు పెద్దలు ఆడదానిని యెప్పుడూ సలహా అడుగవద్దన్నారు.

ధర్మా :—అకారణంగా నన్నలా హేళనచేయడం మీకు న్యాయమేనా ?

పో : న్యాయాన్యాయాలు గ్రహించలేనిజాతి స్త్రీజాతి ఆర్జించే భర్తకు అడుగులకు మడుగులొగ్గడం - ఆర్జించనిభర్తకు అడ పీనుగ వస్తున్నాడని హేళనచేయడం - మీ జాతికి వుగ్గుపాలతో నేర్పబడ్డ పాఠం.

మల్ల : —నాన్నగారూ - క్షమించండి - అమ్మను అలా అకారణంగా అనకుంకన్న విషయాన్ని విపులపరచకూడదా ?

ధర్మా : —నాయనా ! దురదృష్టవంతురాలను. నా నోములు అంతగా ఫలించాయి. మంచిచెప్పినా చెడ్డగా పరిణమించింది.

పో :—మల్లనా, నీవు చెప్పినది మంచిమాటయే. మీ తల్లికి తీరని కనకకాంక్ష జనించింది. దానితో నన్ను సర్వజ్ఞసింగమనీని ఆశ్రయమర్థించమని పంపింది. మీ మామయ్యతో దర్బారున కేగినాను. రాజదర్శనమయింది. భోగినీగృహంలో మరికొంతసేపటికి నా కావ్యప్రదర్శనానికి పరిపూర్ణసమయము మాసన్నమైంది. రాజు నా కవిత్వాన్ని రుచిచూడాలని తన భోగినిమీద దండకాన్ని రచించమన్నాడు. కనకకాంక్షతో రచించా. కానుకలందుకున్నా ...

ధర్మా :—అబ్బా ! కానుకలందుకొని - యెందుకంటే యింత కోపం అయినపని ఆయాక ఆడాళ్ళని యిలా నిరసనచేయడం మీ మగ జాతి లక్షణం.

మల్ల :—ఉండవమ్మా - ఆయన్ని చెప్పనీ.

ధర్మ :—ఉండక యేంచాశానుబాబూ - ఆ కానుకలు నాకు కావాలన్నానా ! యెవరేం చేసుకున్నా నాకేం అక్కర్లేదు.

పోత :—మల్లన్నా - పాపం అమాయకురాలు యింకా కాను కలసిచ్చి ఆమెను పోలేను. కనకకాంక్ష ఆమెను విడనాడలేదు. ఆమె దురదృష్టం.

మల్ల :—అలా అంటారేం నాన్నా.

పోత :—యేమీ లేదు నాయనా! నేను రాచనగరునుంచి యింటికివస్తుంటే ఒక యోగిపుంగవుడు దర్శనమిచ్చినాడు. ఆయన నా కథంతా విని ఫక్కున నవ్వాడు.

మల్ల :—ఆయనకు మతి చలించినదా నాన్నగారూ!

ధర్మ :—అంతే అయివుండాలి లేకపోతే కవితాప్రదర్శనంతో రాజసభను రంజింపజేసి కానుక అందుకొనిన కవినిచూచి హేళనచేయుట - మతిపోవుట కాక మరేమిటి నాయనా?

పోత :—ఆయనకేమీ మతిపోలేదు. మనకే మతిపోయినది.

మల్ల :—అదేలాగ నాన్నా!

పోత :—ఐహికాభోగాలకోసం - తుచ్ఛధనంకోసం - ఏవ్యక్తి అయినాసరే తన స్వాభిమానాన్ని కోల్పోకూడదు. ఆత్మవిశ్వాసాన్ని అరికట్టుకూడదు. పాడుడబ్బులకోసం పరువు విడనాడి - భళాభళీయంటూ భట్రాజులాగ జీవితాన్ని చులకనచేసుకోకూడదు. సిరుల నాశించి నీచులను తెగపొగడకూడదు - యీ సద్జ్ఞానశూన్యుడనై ఆ దిక్కుమాలి రాజసభకేగి - అకళంకవి - భోగినిపై దండకము రచించినాను. మహాపాపిష్టుడనైనాను.

మల్ల :—నాన్నగారూ క్షమించండి. తన సంసారనావను నడిపించడానికి పదిమందిలో పండిత గౌరవం ఆర్జించుకోడానికి-ప్రతివ్యక్తి యేదో బాటను అనుకరించక తప్పదుకదా. మీవలె యిలాంటి ఆశయాలు లేకనేనా తదితరకవులు రాజాశ్రయమో - రాజాశ్రయమో - అని ప్రాకులాడుతుం!

పో :—మంచి ప్రశ్న వేసినావు నాయనా! పుట్టుట - పెరుగుట చచ్చుట - అనునవి పరమేశ్వరాధీనములు. పరమేశ్వరుడు తన సంతా

నమునకు లోటు రానీయడు. నిష్కల్మష హృదయముతో ఆత్మార్పణము చేసిన భక్తులకెల్లప్పుడు ఆయన అండగానే వుంటాడు. నమ్మినమ్మనివారిని శోధించుతూనే వుంటాడు. పరమేశ్వరునిపై భారమువేసి బ్రతుకనెంచినవానికి-ఆ బ్రతుకు భారమనిపించదు. అహంభావముతో తిరుగువానికి అన్నియూ కష్టంకులే. ఆయువులేక చత్తుర్దుగాని ఆహారములేక చత్తురా నాయనా? చచ్చినవారికి ఆహారమిచ్చిన బ్రతికినత్తురా? యిదంతయు అవివేకము - యీ పరిజ్ఞానోదయానికికూడా కొంత సంస్కారం కావాలి.

మల్ల :—తండ్రీ - సమస్కారశతము - నా సందేహానివృత్తి అయింది. మానవుడు బానిసగా వుండకూడదు. పరభాగ్యోపజీవిగా అంతకన్నా వుండకూడదు. స్వేచ్ఛాగానం చేయాలి, స్వతంత్రవాయువు పీల్చాలి. మీతో వాదించి నందుకు క్షమించండి.

పో :— నాయనా! ఆ చిదానందయోగి చేసిన హితోపదేశము విని ఆ రాజభూషణాలను అక్కడి గోటికి అర్పించినాను. ఆ తుచ్ఛధనము మనకు వద్దు. యీ శ్రీనాథ గృహావిసర్జనం వెంటనే జరగాలి. మన యేకశిలానగరానికి వెంటనే పయనంకావాలి. మునివనాన్ని సాగించాలి. తోటలలో యేకాంతంగా కృషీవల జీవితాన్ని సాగిద్దాం. పరమేశ్వరుని మనసారా ధ్యానం చేదాం. ఆ దిక్కుమాలిన భోగినీదండకరచన చేసినపాపం పరిహరించడంకోసం భాగవత రచన చేయమని మన చిదానందయోగి నాకు బోధించాడు.

కం. పలికెడిది భాగవతమట
పలికించెడివాడు రామభద్రుండట నే
పలికిన భవహరమగునట
పలికెద - వేరొండగాథ పలుకగనేలా!

మల్ల :—అమ్మా! నీవు చాలా అమాయకురాలవు, మనపాలిటి యిలవేల్పుగా చిదానందయోగి సాక్షాత్కరించినాడు. శ్రీరామచంద్రుడే యీ రీతిగా అవతరించినాడేమో - యెందుకమ్మా యీ పొరు

గింటి విందులు – యెలా రుచిస్తాయమ్మా ? యీ భోజనాలు – భావ్య భ్యుదయానికి పాశాలు కావటమ్మా – లే – మన స్వస్థలానికి పోదాం – స్వజనంతో సాదరంగా కాలక్షేపం చేదాం – మాయరాజదర్బారు భోగాలు మనకు వద్దు. స్వర్గసీమలో కులికించే శాశ్వతసౌఖ్యం కావాలి కాని యెందుకమ్మా యీ తుచ్ఛసౌఖ్యాలు – హాయిగా మడి దున్నుకొని మన గంజి మనం కాచుకొని తింటగా హరినామసంకీర్తన చేదాం నాన్న చెప్పినట్లు.

ధర్మా :— అలాగే నాయనా ! మీ మాట కాదంటానా – తప్పక అదే నా వాంఛ.

మల్ల :—నాన్నా – అలాగయితే వెంటనే మన స్వగ్రామానికి పోదామా ?

పోత :—అలాగే !

శారద :—(దీనంగా) అత్తా ! నేను రానా ?

మల్ల :— అయినస్తే – వాళ్ళనాన్న యేమంటాడో.

సీ. రాజదర్బారులో ప్రభువులతో గుల్కు–
వారికె వెల్లునె నల్లబతుకు !
భోగాల జీవితాలు పొందుచుండెడి
వారికిష్టమగునె వనగృహాలు !
వాహన సౌఖ్యాల ప్రమదంబు నందెడి
ఘనులకు తూగునే కాలినడక !
షడ్రుచుల్మీర భోజనముచేయు మురియు
సంపన్నులకునేల దుంపకూడు !

గీ. మహిత కవిసార్వభౌము కుమార్తెయైన
యింత సుకుమారి బ్రతుకును వంతపాలు
చేయుచున్నారు మీరు – నిశ్చింతతోడ
రాజకవులకు నచ్చునా ! రైతు బతుకు !

ధర్మా :—యేమీ అనదు రా తల్లీ – శారదా ! రా అమ్మా – నీవు మాకు బరువా ? (నిష్క్రమణ)

△

# ఐదవరంగము

[ఏకశిలానగరము — బాహ్యప్రదేశము - దేవాలయము]

(ప్రవేశము - పోతరాజు - కొందరు భక్తులు)

భక్తులు సమూహముగా భజనసంకీర్తనము.

గేయము.

శివధనువు విరిచావురా రామయతండ్రీ
సీతను పెండ్లాడావు రామయతండ్రీ !
రామయతండ్రీ - రామయతండ్రీ
రక్షించేదేవుడు రామయతండ్రీ !
వారధి బంధించావు రామయతండ్రీ
క్రూరుల శిక్షించావు రామయతండ్రీ
రామయతండ్రీ - రామయతండ్రీ
ప్రేమతో పాలించవయ్యా రామయ్యతండ్రీ !
భక్తులను బ్రోచావురా రామయతండ్రీ
భవబంధము త్రుంచినావు రామయతండ్రీ
రామయతండ్రీ - రామయతండ్రీ
ప్రేమతో పాలించవయ్యా రామయతండ్రీ !

(తదనంతరం నిశ్శబ్దం)

పోత :—సోదరులారా ! ప్రతినిత్యమూ నాతోబాటు మీరు కూడా యిట్లు పరమేశ్వరధ్యానముచేయుట - మీ వంటి సహృదయుల సహకారము లభించుట నిజంగా పరమేశ్వరానుగ్రహంకాని వేరొండు కాదు.

ఒకభక్తుడు :—ఏదో మంచిముక్కలు చెవిని పడేస్తున్నారు మహాప్రభువు !

పోత :—నాయనలారా ! మనలను సృజించి - మనకు వలయు పదార్థములను సమకూర్చి సర్వదా మనలను రక్షించు ఆ పరమేశ్వరుని మరచి అహంకారముతో అజ్ఞానాంధకారమునబడి స్వర్గసుఖమును కోల్పోవుటకన్న నష్టమేమున్నదో యూహించుడు. దైనందినజీవనకార్య క్రమములో భగవత్సంకీర్తనకూడా ఒక కార్యక్రమమని నమ్మి - నిర్ధా రణ చేసుకోవలెను. అలాంటి దృఢతర నిశ్చయుడైన భక్తుని పిలుపుల కెప్పుడును పరమేశ్వరుడు పలుకుచునేయుండును. సోదరులారా ! ఇది రామాలయము. రాము డిక్కడనేగాని యింకెక్కడను లేడనుకోకూ డదు - ప్రహ్లాదుడు చెప్పినట్లు.

కం. ఇందుగల డందులేడని
సందేహమువలదు చక్రి సర్వోపగతుం
డెం దెందు వెదకిచూచిన
నందందేగలడు దానవాగ్రణివింటే !

ప్రతిహృదయమునందూ పరమేశ్వరుడున్నాడు - పరమేశ్వర ధ్యానము చేయుట కుత్సాహపడుడు - పరమేశ్వరధ్యానమే యిహపర సాధనము—

సీ. కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
సురరక్షకునిజూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు శిరము శిరము
విష్ణు నాకర్ణించు వీనులు వీనులు
మధువైరి దవిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదములు
పురుషోత్తమునిమీది బుద్ధి బుద్ధి

తే. గీ. దేవదేవుని చింతించు దినదినము
చక్రహస్తుని ప్రకటించు చదువు చదువు

కుంభినీధవు జెప్పెడి గురుడు గురుడు
తండ్రి హరి జేరుమనియెడి తండ్రి తండ్రి!

మహాజనులారా! యీ నరజన్మమెత్తినందుకు సార్థకము హరి సంకీర్తన. హరిసంకీర్తనచేయని అవయవములు - అవయవములేనా? రామాంకితముకాని శరీరము - శరీరమగునా? యథాశక్తిగా తీరిక సమయములందు పరమేశ్వర ధ్యానముచేయవలెను - మనుగడను సార్థకపరచుకోవలెను. అజ్ఞానము నంతరింపజేయవలెను.

సీ. కంజాక్షునకుగాని కాయంబు కాయమే
పవనగుంఫిత చర్మభస్త్రిగాక!
వైకుంఠు బొగడని వక్త్రంబు వక్త్రమే
ఢమ ఢమ ధ్వనితోడ ఢక్కగాక?
హరిపూజనములేని హస్తంబు హస్తమే
తరుశాఖ నిర్మిత దర్విగాక
కమలేశు జూడని కన్నులు కన్నులే
తను కుడ్యజాల రంధ్రములుగాక
ఆ. వె. చక్రి చింతలేని జన్మంబు జన్మమే
తరళ సలిల బుద్బుదంబుగాక
విష్ణుభక్తిలేని విబుధుండు విబుధుడే
పాదయుగముతోడి పశువుగాక!

అందువల్లనే - సుఖానికైనను - కష్టాలు గట్టెక్కుటకైనను కారకుడు - ప్రేరకుడు - ఆమోదకుడు ఆ పరమేశ్వరుడని నమ్మవలెను.

సీ. సంసార జీమూత సంఘంబువిచ్చునే
చక్రిదాస్య ప్రభంజనము లేక
తాపత్రయాభీల దావాగ్నులారునే
విష్ణుసేవామృత వృష్టిలేక
సర్వంకషామోఘ జలరాసులింకునే
హరిమనీషా బడబాగ్ని లేక

ఘనవిపద్గాఢాంధకారంబు లడగునే
పద్మాక్షునుత రవి ప్రభలు లేక
గీ. నిరుమాన పురాణ వృత్తి నిష్కళంక
ముక్తినిధిగాన వచ్చునే ముఖ్యమైన
శార్ఙ్గ కోదండ చింతనాంజనము లేక
తామరసగర్భునకునైన ధన్యులార !

ఒకభక్తుడు :—(పక్కవానితో) అమృతగుటకలులా వున్నా యిరా – మన పోతన్నగారి మాటలు.

ఇంకొకడు :—ఎట్టిమొగమా ! మాటలంటావేంటిరా ! అవి పద్దికాలు !

మరొకడు :—పద్దికాలా ! ఇంచక్కా వున్నాయిరా !

ఒకభక్తుడు :—అరూ ! ఈమద్దె గంటి – బాగోతం రసింసే రట – అదగదిందులో వేయిగా పద్దికాలు.

అందరు :—మా పెబువులు – మంచిమాటలు సెలవిత్తుండారు. దండాలు బాబయ్యా – మీ దయవుండాల బాబయ్యా – మాందా తలు – సల్లగా వుండాలి.

ఒక :—పోతనగారి దణ్ణాలెట్టి శలవడగండహే !

అందరు :—దణ్ణాలు బాబయ్యా ! శలవిప్పించండి బాబయ్యా !

పోత :—సోదరులారా ! రాముని శలవయింది – మన మీపాటికి కాలక్షేపము చాలింతము – రేపీపాటికి తప్పక వస్తారుకారూ – గుణధాముడైన రాముని మనసారా పాడుదము – భవబంధనాలను తెగ త్రెంచివైతము.

అంద :—సిత్తం. గేయం.

మంచిమాట సెవినిపసె మా పెబువండీ
కించలన్ని గూల్చేటి గొప్పవాడండీ !
పోతరాజు మాటయింటె పున్నెమేనండి
వూరికె మన వూసులాట మానుగలెండి

అ స్తమానూ తగవులాడే బాటమానండి
కా స్తహరినామంబు చెవుల వేయండి
యెంటవచ్చేది ఇల యేమిలేదండి
వుంటే పుణ్యంబు వోకటె వచ్చువినండి.
(గానంతో నిష్క్రమణ)

△

# ఆ ర వ రం గ ము

(పోతన్నయిల్లు - తెరతీసే సమయానికి శ్రీనాథ ప్రవేశం.)

శ్రీ:—(తనలో) బావకు యీ విజనప్రదేశమే యీ యేకాంత వాసమే వాంఛనీయముకాబోలు! అడుగులకు మడుగులొత్తే పరిచారక జనమూ, ఆశలను సఫలీకృతంగా చేసే రాజాశ్రయమూ, యిహసుఖ నాధకమైన సంపద వెగటుగా దోచినవికాబోలు! (ముందుకు నడచి) ఔరా! అల్లారుముద్దుగా పెరిగిన నా ముద్దుచెల్లెలికి సర్వసౌఖ్యములకు స్వస్తి అయినదిగదా! దాసదాసీజనాలతో పరిచారకా సమూహంతో ప్రమదజీవితాన్ని నిర్వహించే యీ సుకుమారి శీకరాటవులమధ్య— వనవృక్ష సంతతులలో - మునిపత్నిగా మునికగుడ్డల కట్టి వందురు చున్నది. అమాయకురాలు - అదుగో యిటే వచ్చుచున్నది!

(ప్రవేశం - ఆనందంతో ధర్మాంబ పాత్రలతో)

ధర్మా:—దారితప్పివచ్చినావేం అన్నయ్యా! కాళ్ళుకడుక్కొని మంచితీర్థం తీసుకో అన్నయ్యా! (పాత్రల్ని వుంచుతుంది)

శ్రీ:—అన్నిదారులూ బావగారే తప్పినారుకాని నేనేం తప్పినానమ్మా?—

ధర్మా:—ఆయనమాత్రం చేసిందేముంది చెప్పు.

శ్రీ:—ఆయనకాక యెవరుచేశారు - యెవరుచేయగలరు చెప్పు తల్లీ?

ధర్మా:—ఏదో విధివిలాసం అన్నయ్యా!

శ్రీ:—మానవుడు 'విధివిలాసం' 'కర్మ' అనే వాదాలతో తన జీవితాన్ని దుఃఖమయంచేసుకోవడం తాతలనాటినుంచీ వచ్చే ఆచారమే. ఇవి బొత్తిగా హిందూమతంలో ఉగ్గుపాలతో నేర్పబడుతూ వుంది. శాయశక్తులా మానుషప్రయత్నం జరగాలి. ప్రపంచంలో పుట్టినందుకు తన్ను నమ్ముకొని ఉన్న ఇల్లాలు - ఆమె సంతానమూ వున్నందుకు గృహస్థు యెంత త్యాగమైనా చేసితీరాలి. తనకుటుంబపోషణార్థం గృహమేధి అష్టకష్టాలను పడాలి. చివరకు దైన్యాన్ని అయినా ఆహ్వానించి కుటుంబ ప్రతిష్ఠ నిలుపుకోవాలి. తనకుమాలిన ధర్మమూ- మొదలుచెడ్డ బేరమూ వుందా చెల్లీ! కవిరాజబిరుదుతో కావ్యకుసుమావళిని భూకాంతలకు కానుకలిచ్చి పురంబులో - వాహనంబులో పారితోషికంగా పొందవలసిన భాగవతం నాకు నచ్చలే. ముందు ముందు అభివృద్ధిలోకి వస్తాననుకొన్న మల్లన్నకు ఓటమి అంటూ మొగ్గలపసి మొగ్గడు నన్ను బాధపెంచింది. సరే - నీకీ విజయప్రదేశంలో అడుగుపెట్టింది లగాయతు శాంతీ - కాంతీ లేకుండాపోయాయి. నీ ముఖవర్చస్సులో - చెల్లీ - ఏమిటమ్మా - బావకీ విపరీత పరిణామానికి హేతువు?

ధర్మా:—హేతువు కేమున్నదయ్యా! ఆయనకు హాలిక జీవనం హాయిగా వున్నదట!

(ప్రవేశం—పోతన్న - అతని కుమార్తె గిరిజా)

గిరి:—మామయ్య వచ్చాడు నాన్నా! అదుగో (చూపెంచును)

శ్రీ:—రా తల్లీ - గిరిజా! శారద యేది?

గిరి:—అదుగో వస్తూంది మామయ్యా.

(ప్రవేశం—శారద)

శ్రీ:—రా తల్లీ - శారదా! అత్తయ్యతో వచ్చావా? అమ్మా!

శార :— మరే నాన్నా ! నాకు మన యింటికన్న యిక్కడే హాయిగావుంది నాన్నా !

పోత :— బావగారు ! బహుకాలదర్శనభాగ్యం యిచ్చారు.

శ్రీ :— హాలికులకు - మా దర్శనభాగ్యా లెందుకు బావా ?

పోత :— హాలికులంటే మీ వూహ తెలుసుకోవచ్చునా బావా!

శ్రీ :— హాలికులంటే నాకూ ఆనందమేకాని - నీ వంటి సత్కవి హాలికజీవితాన్ని - యిలాంటి విజన ప్రదేశంలో యేకాంతంగా సాగించడం నాకు యిష్టంలేదు బావా ! కవితకు ఆశ్రయం కావాలి శోభించాలంటే ఏమంటావు ?

పోత :— ఏమో బావా ! కవులు భూకాంతులకు కావ్యాలను అంకితంచేసే పద్ధతి మానుకోవాలి. స్వాభిమానపూరితంగా జాతీయత నాళనాళాలిలోనూ ప్రవహిస్తూండగా స్వేచ్ఛాగానం చేయాలి. హాలిక జీవనంలోనే యిహపరసాధనం వుంది.

సీ. మందుకొండలమాటు మఱచిపోయినయట్లు
పొలములందే తిర్గు పుణ్యమూర్తి !
జడివానలకుగూడ జడుపింతయున్ లేక
చేలోననుండెడి శీలధనుడు !
జామురాతిరినైన జంకుగొంకును లేక
పంటభూములకేగు ప్రథిత యశుడు !
యేవేళలందైన యే సుఖంబును లేక
సస్యసాధనజేయు సద్గుణుండు !

గీ. చవిటిపర్రల సస్యాల సదనమట్లు
మార్పుచేసిన యొకగొప్ప మాంత్రికుండు !
కలముకన్నను గొప్పదీ హాలమటంచు
విశ్వమంతయు వానికి వినతులిడు !

గీ. కీర్తియనుదాని కెంతయు ఆర్తిలేక
త్యాగజీవిగనున్న యీ హాలికుండు

కన్నుమూసిన – ఎవరికీకలదు జాలి !
కోట్లప్రజలకు నాతడే కూడుపెట్టి !

శ్రీ :—ఔను హాలికులు – హాలికులను సమర్థించకుండావుం టారా బావా ?

పో :—బావా ! హాలికులు ! హాలికులు ! ! హాలికులు ! ! ! అని నీవు వచ్చినప్పటినుంచీ హేళనచేస్తూవున్నావ్ – కాని—

ఉ. బాలరసాలసాల నవపల్లవకోమల కావ్యకన్యకన్
కూళలకిచ్చి యప్పడుపుకూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికులైననేమి ? గహనాంతరసీమల కందమూల గౌ
ద్దాలికులైననేమి – నిజదార సుతోదర పోషణార్థమై !

శ్రీ :—భావసమాధానం చలావుంచు – కాని పద్యశోకడమూ త్రం చాలాహృద్యంగావుంది బావా ? చెల్లీ ! కర్షకజీవనకాంక్ష లుగ్రూ తలూగే బావ హృదయంలోంచి కవితాశక్తి పాలసముద్రం పొంగి నట్లుగా వున్నదమ్మా – బావా మళ్ళీ చదువుగా- నీ సుమధురతరపద్యం!

(పోతన్న పై పద్యాన్ని మళ్ళీ చదువుతాడు)

గిరి :—మావయ్యా ! నాన్న ఓ మంచిపుస్తకం వ్రాశాడు – చెప్పనా !

శ్రీ :—యేమిటీ ! మంచిపుస్తకమే ! పేరేమిటి గిరిజా ?

గిరి :—(తండ్రివైపు చూచి) భా–గ–వ–తం ! బాగుందా మావయ్యా ?

శ్రీ :—(పరిహాసతో ఆశ్చర్యం) భా–గ–వ–తం ! భాగ–వతం !! భాగవతం ! ! ! ఏం మధురనామం వినిపించావు గిరిజా ! (బావతో) రెండు పద్యాలు వినిపించుకూ బావా ?

గిరి :—నాకు వచ్చును మావయ్యా ! చదవనా.

సీ. మందార మకరంద మాధుర్యమున దేలు
మధుపంబువోవునే మదనములకు

నిర్మల మందాకినీ వీచికలమూగు
రాయంచచనునె తరంగిణులకు
లలిత రసాలపల్లవఖాదియై చొక్కు
కోయిలసేరునే కుటజములకు
పూర్ణేందు చంద్రికా స్ఫురితచకోరక
మరుగునేసాంద్ర నీహారములకు

తే. నంబుజోదరు దివ్య పాదారవింద
చింతనామృత పాన విశేషమత్త
చిత్తమేరీతి నితరుల జేరనేర్చు
వినుత గుణశీల - మాటలు వేయునేల !

శ్రీ :— 'వినుత గుణశీల మాటలు వేయునేల' – ఆహాహా ! గిరిజా ! అన్నపానీయాలపై ఆశ లేకుండా చేసే కావ్యగానాన్ని అమృత వర్షంగా కురిపించావు గిరిజా ! బావా ! యెన్నాళ్ళయింది యీ సుగ్రంధానికి శ్రీకారం చిద్ది —

పో :— యేదో – పేదకవులం బావా – యిూవలనే ముగించా !

శ్రీ :— చాలా ధన్యుడవు బావా ! చక్కగా భగవత్సంకీర్తనా భాగ్యం సముపార్జించుకున్నావు.

పో : – బావా ! చాలాసేపయింది – యిక భోజనాలకు లేద్దామా – ఏం–ధర్మాంబా - ఆలస్యమేమిటి.

ధర్మా :— ఆలస్యం యేమీలేదు – లేవండి – మడిగట్టుకోండి

పో :— లే బావా !

శ్రీ :— మల్లన్ననురానీ – అంతా ఒకసారే కూర్చోవచ్చుగా

పో :— అక్కర్లేదు బావా – మా వాడు వెందరాలేరాడు మనం లేద్దాం. (నిష్క్రమణ–ధర్మాంబ–గిరిజ–శారద)

శ్రీ :— అలాగయితే సిద్ధమే.

(నిష్క్రమణ)

# ఏడో వరంగము

భోగినీగృహము—(ప్రవేశం-సింహాసనాసీనుడైన సర్వజ్ఞసింహుడు. నృత్యసన్నద్ధయైన భోగిని)

(నృత్యానంతరం) గేయం.

కన్నెగులాబులు నిన్నెపిల్వగా
కన్నువిప్పవేలా! యీ లీలా!
భృంగకుమారా! పంతమిదేరా!
చెంగటజేరి రమింపగ లేరా!
బావగారి పస బయటపడెనంచు
మల్లియలకాంత మేలమాడెరా!
అందగాని వలపయ్యో యిదే! యంచు
మందారము నిను అపహసించెరా!
చాలు మాబావ సరసములటంచు
మాలతి నినుజూచి కేలిగొనెరా!

సర్వ:—భోగినీ - నృత్యమునకేమిగాని మన శ్రీనాథకవివరేణ్యులేలకో రెన్నాళ్ళనుండి మన సమావేశమునకు రాకుండకున్నారు. కారణం తెలియకున్నది భోగినీ!

భో:—ప్రభువులు సంకల్పసిద్ధులు - అదుగో శ్రీనాథకవివరేణ్యులు వచ్చుచున్నారు.

(ప్రవేశం శ్రీనాథుడు)

సర్వ:—కవిరాజా! దయచేయండి.

శ్రీ:—చిత్తం - మహారాజా!

సర్వ:—తమరు రాని కొలువు కళావిహీనమైనది. అత్యద్భుత నాట్యప్రదర్శనముతో డస్సిన భోగిని ప్రోత్సాహ మిచ్చ లేకపోయింది. మీ రాకతో - యెక్కడికో షికారుకొట్టిన నా ఆనందం యిప్పుడు తిరిగి కుదురుకుంది.

శ్రీ :—అంతయు మీ అవ్యాజప్రేమ కుదాహరణం మహారాజా!

సర్వ :—మీ రింతపలుకు టెక్కడ కేగిరి శ్రీనాథా!

శ్రీ :—యేమిచెప్పుకోను మహారాజా!

సర్వ :— అలా - నిరుత్సాహపడడానికి కారణం?

శ్రీ :—కారకుడు - మీ భోగినీ దండకకర్త అయిన పోతన.

సర్వ :—ఎట్లు?

శ్రీ :—కవీశ్వరుడని - కళాభిజ్ఞుడని - తెలివిగలవాడని - కూటికి గుడ్డకు కొఱతలేనివాడని ఎంతో ఆలోచించి ముచ్చటగా మా ముద్దు చెల్లెలను యీ పోతన్నకిచ్చి వివాహముచేసిన విషయము ప్రభువులకు విశదమే. కొన్నాళ్ళవరకు అతడు మా యింటివద్దనే యున్నాడు.

సర్వ :—ఔను.

శ్రీ :—అప్పుడేగదా! ప్రభువుల సన్నిధికి ఆ నిరుద్యోగిని తీసి కొనివచ్చుట - యేదో వాత్సల్యమో లేక బావమఱదుల సంబంధమును గల్పించుకొని అతనిని శ్రీవారు రాజకవిగా స్వీకరించుట - తదుపరి భోగినీ దండకరచనమునకు మీరు కర్పూరతాంబూల మా కవికి సమర్పించుట - రాజాజ్ఞానుసారముగా నాతడు దండకసమాప్తిచేయుట - భూషణాంబరములను కానుకలుగా గొంపోవుటకూడ ప్రభువులవారికి యెఱిగినవిషయమేగదా!

సర్వ :—యెఱిగిన విషయములకేమి - యెఱుగని విషయము లను విపులపరచినచో మా ఆతురత తగ్గును.

శ్రీ :—రత్నాంబరాలను గొంపోవుతూండగా మా బావకు యెవడో బూడిద బుస్సన్న కన్పించినాడట! ఐహికభోగాలకు మానవుడు ఆసక్తి చూపకూడదు. కర్షకజీవనంతో కాషాయిగుడ్డలతో వైరాగ్యభావాలతో విపినప్రదేశాలలో కాలక్షేపం చేయమన్నాడట ప్రభూ!

సర్వ :—బాగున్నది కవిరాజా! యెవడో విరాగిచెప్పిన వేదాంతవాక్యాలకు పోతన్నవంటి విజ్ఞాని దాసానుదాసుడైనాడా?

శ్రీ :—అక్షరాలా అయినాడు ప్రభూ !

సీ. రత్నాంబరాలకు యత్నించు నెమ్మది
కాషాయిగుడ్డలు కట్టమనెనో !
భోగినీదండకము రచియించు కవిత
హరినామకీర్తన నాడమనెనో !
పూలహారాలతో పొలుపొందు కంఠంబు
రుదురాక పేరుల నదుముకొనెనో !
రాజకాన్కలనందు రమ్యమౌ హస్తంబు
హలమునుబూనగా నాసగొనెనో !

గీ. యెన్నిభావాల యుద్ధాలకేగె నేమొ !
మనసు మళ్లించుకొన్నాడు - మమతవీడి
అతడు కవియోగి - నిజమైన హాలికుండు !
మాన్యుడైనట్టి పోతన్న - మారిపోయె !

తనభార్య - తనకుమారుడు - తన ముద్దులుమూతుకు నా కుమార్తె శారద అందరును అతని అనుచరులుగా నుండగా మా బావ పోతన్న యేకశిలానగరమున స్వేచ్ఛాజీవనము సాగించుచున్నాడు.

సర్వ :—భోగట్టా నెక్కడ సంపాయించుకున్నారు? —

శ్రీ :—సంపాదన కేమున్నది మహారాజా! యథాప్రకారముగా గృహోన్ముఖుడనై పోవుచుండగా ప్రాణస్నేహితులు బావగారి పలాయనవార్తను చెవినిబడవేసినారు. ఆతురతతో పలాయనప్రదేశమున చేరినాను.

సర్వ :—బావగారి సందర్శనభాగ్యము లభించినదా ?

శ్రీ :—లభించకేమి - లభించింది - మహారాజా !

సర్వ :—శ్రీనాథా ! కవిగారు కొత్తకాపుర మెట్లుచేయుచున్నారో శెలవిచ్చెదరా ?

శ్రీ :—కొత్తకాపురానికేమున్నది - బ్రహ్మానందముగా సాగుచున్నది. నిర్విచారము - పరమేశ్వర చింతన ! ప్రశాంతజీవనము !!

సీ. సంకీర్తనమునకు సమయమైనదటంచు
చిడతలతో నడక్క సాగుచుండ!
హరినామకీర్తన ఆహారమన్నట్లు
భోజనకాంక్షలు ముగియుచుండ!
సాటిగ్రామీయు సాదరభావమే
వాంఛితధనమట్లు వరలుచుండ!
అవకాశముండగా హాలముచేబూనుటే
దినకృత్యమనుమాట తెలియుచుండ
గీ. భోగమెఱుగక - వరమౌనివోలె నతడు
నడుపుచున్నాడు సంసార నావనింక!
సుఖమునెఱుగని గేహంబు చూచుకొలది
వంతనొందితి లోలోన - వానిజూచి!

కాని మహారాజా! ఒకందుకు మాత్రము నా మనస్సు వాని ఇంటిని స్వర్గసీమగా గనుపించింది!

సర్వ:—ఎందుకు శ్రీనాథా?

శ్రీ:—అతడు భగవన్నామసంకీర్తన చేయుచూ - భాగవత మనే చక్కని కావ్యాన్ని రచించాడు. మచ్చుతునకలుగా కొన్ని పద్యాలు విన్నాను. హృదయాన్ని ఆకర్షించి ఆనందింపచేసిన ఆ చక్కని పద్యాలను చదివి చదివి మైమఱచిపోయాను మహారాజా!

సర్వ:—మీకు అంతగా ఆనందాన్ని అర్పించి ఆ మనోజ్ఞ కావ్యంలోని కొన్నిపద్యాలను చదివి వినిపింతురా!

శ్రీ:—తప్పక వినిపిస్తాను మహారాజా!

సీ. మందారమకరంద మాధుర్యమునదేలు
మధుపంబు వోవునే మదనములకు
నిర్మలమందాకినీ వీచికలదూగు
రాయంచ చనునె తరంగిణులకు

లలితరసాల పల్లవఖాదియై చొక్కు-
కోయిల సేరునే కుటజములకు
పూర్ణేందుచంద్రికా స్ఫురిత చకోరక
మరుగునే సాంద్ర నీహారములకు

గీ. అంబుజోదరు దివ్య పాదారవింద
చింతనామృత పాన విశేషమత్త
చిత్తమేరీతి నితరుల జేరనేర్చు
' వినుత గుణశీల – మాటలు వేయునేల!

ఇదొక మచ్చుతునక! ఇదేమార్గంలో – యిలాంటి మధురతర పక్తులో మనపోతన్న అమరకావ్యాన్ని రచించాడు. ఆ కావ్యమాధురికి నన్ను నేనే మఱచిపోయాను మహారాజా!

సర్వ:—కవిసార్వభౌమా! మచ్చుతునకను విన్నప్పటినుండియు నా మనస్సు పోతన్న – భాగవతముమీదనేయున్నది. యెట్లైనను పోతన్నను ఒప్పించి నా సభలో భాగవత పద్యపఠనము చేయునట్లును – ఆ సద్గ్రంథమును నా కంకిత మొనర్చుటకును యేర్పాటు మీరు చేయక తప్పదు. రేపే - మీరు యేకశిలానగరమునకు పయనమై పోతన్నమహాకవిని సందర్శించి నా కుతూహలమును యెఱుకపఱచి నా సంకల్పమునకు విజయసిద్ధి నొసంగవలెనని కోరుచున్నాను.

శ్రీ:—మహారాజా!

గీ. యైహికంబును విడనాడి ఆశలేక
వట్టిబైరాగిగానున్న బావకిపుడు
కాంక్ష జనియింపజేయుట కష్టతమము!
పాలనముసేతు – నేమైన ప్రభువునాజ్ఞ!

ప్రయత్నించెద మహారాజా! యిదే యేకశిలానగరమునకు సపరివారముగా పోవుచున్నాను.

△

# ఎనిమిదవరంగము

పోతన్న యిల్లు—(ప్రవేశము - పోతన్న-ఆతని కుమార్తె - గిరిజ)

పో :—గిరిజా ! అమ్మకి కాస్తపని సహాయంచేయక యెందు కమ్మా యిలా నాతో తిరుగుతావు ? కన్య తనజీవితాన్ని స్వర్గసీమలా ఆనందించ కోవడానికి సోపానాలను నిర్మించుకోవాలి. నిజంగా కన్యాత్వమే భావిజీవిత శుభోదయం.

సీ. గయ్యాళి గారిగా కాంతునితో సదా
కలహించునంత రాకాసివైన !
మారెమ్మ రీతిగా నోరెత్తి పిల్లల
సాధించునట్టి పిశాచివైన
యేకాకిగా దానమేలేని బ్రతుకును
సాగించునంతటి శవమదైన !
మనసారగా హరి స్మరణను చేయక
కాలమున్ వెలిబుచ్చు కఠినవైన !

గీ. కన్య జీవితమందలి ఘడియలందు
నాటుకొనినట్టి చెడుయలవాట్ల ఫలము !
పరమపావన జీవన భాగ్యమందు
కీర్తిగాంచుము ! భక్తితో గిరికుమారి !

పెళ్ళియీడుకివచ్చిన పిల్లవుతల్లీ - మంచివైనను చెడ్డవైనను - నీవుచేసిన ప్రతిపనికిని మేమే బాధ్యులగుదుమమ్మా ! సంసారములో జరుగు ప్రతిసన్నివేశమునకు కర్త రామభద్రుండని నమ్మవలెను. తెలిసిందా గిరిజా ! యిప్పటినుంచి హరిసంకీర్తన అలవాటుచేసికొన్నచో సర్వసంకటములును తీరుతాయి. యిహపరసుఖములు చేకూరుతాయి. తీరికసమయాలలో అమ్మ అనుజ్ఞతో భాగవత పఠనచేసుకో చిట్టితల్లీ,

గిరి :—నాన్నా ! నేను ప్రతిరోజుకూడా అమ్మకి పనిచేసిపెడుతూంటే శారదవదిన అడ్డువచ్చి – నీవేంచేయక్కరలేదంటూంది అంచేత నేను యించక్కా భాగవత పఠన చేసుకుంటున్నాను.

పో :—భాగవతపఠన చేసుకుంటున్నావా తల్లీ – యేవీ – నీవు చదివేపద్యాలు !

గిరి :—గజేంద్రుని మొర – శ్రీవిష్ణుదర్శనం ఆ పద్యాలు చాలా బాగున్నాయి నాన్నా – ఆ పద్యాలు చదువుతూంటే నా గుండెలు ఝల్లుమంటాయి !

పో :—చదువమ్మా – రెండుపద్యాలు.

గిరి :- సీ. కలుగడే నాపాలి – కలిమిసందేహింప
కలిమిలేములు లేక గలుగువాడు
నాకడ్డ పడరాడె – నలిన సాధువులచే
బడినసాధుల కడ్డుపడెడివాడు
చూడడే నాపాటు చూపుల చూడక
చూచువారలఁ గృపఁ జూచువాడు
లీలతో నా మొఱాలింపడే మొఱగుల
మొఱలెఱుంగుచు దన్ను మొఱగువాడు
తే. అఖిలరూపులు తనరూప మైనవాడు
ప్రథమ మధ్యాంతముల గానబడెడివాడు
భక్తజనముల దీనుల పాలివాడు
వినడె ! గూడడె ! తలపడె ! వేగరాడె !

పో :— అర్థం అవగాహన చేసుకున్నావు – యిదంతా భగవదనుగ్రహం గిరిజా ! చాలా ! ధన్యురాలవయ్యావు ! యింకోటి చదువమ్మా !

గిరి: —

శా. లా వొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యె బ్రాణంబులున్
ఠావుల్దప్పెను మూర్ఛవచ్చె దనువున్ శ్రమంబయ్యెడిన్

నీవేతప్ప నితఃపరంబెఱుగ మన్నింపన్ దగున్ దీనునిన్
రావే యీశ్వర కావవే వరద - సంరక్షింపు భద్రాత్మకా!

పో :—గిరిజా చక్కగా చదివావుతల్లీ! భాగవతంలో గజేంద్ర మోక్షం తప్ప యింకేఘట్టమూ నీకు నచ్చలేదా గిరిజా?

గిరి :—నచ్చకేం నాన్నా! అది పరమేశ్వర సహాయాన్ని పొందిన ఘట్టం - దివ్యరచన చిందులు త్రొక్కిన రచన - అది నాకు ప్రత్యక్షం!

పో :—గిరిజా - యేమిటి - యీ కావ్యకల్పన!

గిరి :— కావ్యాలు కల్లలుకావచ్చునుకాని - నాన్నా - నా మాటలు మాత్రం కల్లలుకావు!

పో : —అదేమిటి గిరిజా?

గిరి : — నాన్నా! నీవు మహాభాగవతం రచించే సమయంలో ముఖ్యంగా గజేంద్రమోక్షం రచించే సందర్భంలో ఒకపద్యం దగ్గర నీకు కలం ఆడిందికాదు.

పో :—(ఆలోచించి - ఆలోచించి) ఔను గిరిజా! జ్ఞాపకం వచ్చింది!

గిరి :—అదేంపద్యమో చెప్పుకో మరి!

పో :—

మ. అలవైకుంఠ పురంబులో-నగరిలో ఆమూలసౌధంబు దా
పల మందార వనాంతరామృత సరః ప్రాంతేందు కాంతోపలో
త్పల పర్యంకరమావినోదియగు నాపన్న ప్రసన్నుండు, వి
హ్వల నాగేంద్రము పాహిపాహియనగుయ్యాలించి సంరంభియై!

గిరి :— ఇందులో రెండోపాదం కేవలం ఆ రామరచనకాని నీ రచనకాదు నాన్నా! నీవు పద్యారంభంచేసి రెండోపాదం సాగించలేక తబ్బిబ్బు పడుతూవచ్చావు! అప్పుడు నాకు కొంచెం కునుకు పట్టింది కన్నుమూసి తెఱచేలోపుగా—

గీ. మనుజమాత్రుని రీతి రామప్రభుండె
కంటమునుబూని పూరించె కావ్యమపుడు !
ఎఱుగనైతివి — యీనాఁటి వఱకు నీవు !
పరమపావన గ్రంథ మీ భాగవతము !

పో : —(బ్రహ్మానందముగా) ఎంత అదృష్టవంతురాలవు సీతా! రామరచనను కనులారజూచిన ధన్యురాలవు ! నయనమున్న కేమి-పుణ్యాత్మురాలవు !

(నిష్క్రమణ)

△

# తొమ్మిదవ రంగము

(స్థలము - పోతన్న యిల్లు - పోతన్న ఏకాంతం.)

పో : —(తనలో) పరమేశ్వరస్వరూపిణ్యైనా అజ్ఞానతిమిరము నడచు జ్ఞానభాస్కరుడైన నా చిదానందమహర్షి పునర్దర్శనభాగ్యమీయకున్నాడు ఆయన హితబోధానుసారముగా సంపూర్ణమైన భాగవత గ్రంథమును గురుస్వాములకు మనసారా చదివి వినిపించు భాగ్యము లేదుకాబోలు ! పరమేశా ! నాకు చిదానంద మహర్షి సందర్శన భాగ్యము లేదా !

(తెరలో పాట)

గేయం.

చంద్రుడే కనుపించడా
కలువ కన్యను చూడడా
నీడజాడడా యీ తారలా
కడతేర్పడా యీక బాధలా ఇంక
మా దాసుల మాటనమ్మి

మనసునే చెడగొట్టైనా
యీ యమాయకురాలి ప్రేమకు
యీ నిరాశయే ఫలితమా ! ॥చం॥
వెలుగు నీడలు వున్నవా
కులుకు లామెను జేరవా
జీవితానికి పండువెన్నెల
నీవిగూర్చవె యీ యిల ! ॥చం॥

అదుగో ! ఏదో కంఠధ్వని వినిపించుచున్నది. అది మా గురుస్వాముల కంఠస్వరముగానే యున్నది. ఇటులనే వచ్చుచున్నట్లున్నది. ఆహా ! ఇదంతయు పరమేశ్వరకృప ! తన్ను నమ్మినవారికి సర్వదా క్షేమమును చేకూర్చు ఆ భగవంతుని కృపను — నావంటి అల్పజ్ఞునకు వర్ణింప శక్యమా !

(ప్రవేశము చిదానందుడు)

(నమస్కరించి) మహాత్మా దయచేయుడు — మీ ఆదేశానుసారముగా భాగవతమును రచించినాను. మీ రెప్పుడు వత్తురా ! మీ కర్ణములలో నా రచన యెప్పుడు పడునా ? అని తహతహలాడుచున్నాను మహాత్మా !

చిదా :— పోతన్నా ! భాగవతమును రచించు నంతటితో నీ పని కాలేదు. కావ్యకన్యలను వరించి బంధించి పెండ్లాడుటకై భూకాంతులు ఉవ్విళ్ళూరుచున్నారు. ధనబలము నుపయోగించి తమ కోర్కెలు తీర్చుకొనుట భూకాంతులకు ఉగ్గుపాలతో నేర్పిన గుణపాఠం పోతన్నా ! పరమపవిత్రమై పరమేశ్వరాంకితమైన యీ దివ్యభాగవత గ్రంథాన్ని మానవస్వాధీనం చేయకు. అప్పుడే నీ జన్మ ధన్యము కాగలదు !

సీ. ప్రభువులకోసమై పద్యాలు రచియించి
ఆత్మాభిమానంబు నమ్ముచువారు !
ప్రభువులకోసమై ధన్యప్రబంధాల
పరువన్నదే లేక వ్రాయువారు !

ప్రభువులకోసమై పరిరాళ్ళకొరకునై
దర్బారు విడలేక దనరువారు!
ప్రభువులకోసమై పాదుదర్జాకునై
స్వేచ్ఛానురక్తిని చించువారు
గీ. బిరుదులనుగూర్చి మతిలేని వెట్టివలెను
కనకకాంక్షల దనరారు కవులగన్న
జాలి గల్గుచునున్నదో సత్కవీశ
ప్రభులదాడికి ఆగునా? భాగవతము!

బలసామర్థ్యములుగలవారు ప్రభువులు - రాజు దండమున్న దెబ్బలకు కొదువా? రాజుగారి కోపమే దీరుట యే పాటికష్టము. రాజ్యము రాజుది. రాజ్యములోని ప్రజలందరు రాజాజ్ఞకు బంధీభూతులు - రాజగారికన్న నీ గ్రంధముపై బడకుండవలెను పోతనార్యా!

పోత:—(లోపలికి వెళ్ళివచ్చి) మహాత్మా! యిదిగో నా భాగవతము. నా గ్రంధమునకు - నాకు శుభాశీస్సుల నిడుడు మహాత్మా!

ఓదా:— (భాగవతమును చూచి) యీ దిగువ పద్యాలను చదువుతాడు.

శా. శ్రీకైవల్యపదంబు జేరుటకునై చింతించెదన్ లోకర
క్షైకారంభకు భక్తపాలన కళాసంరంభకున్ దానవో
ద్రేకస్తంభకు కేళిలోల విలసద్దృగ్జాల సంభూత నా
నాకంజాత భవాండకుంభకు మహానందాంగనా డింభకున్.

(పేజీ తిరగవేసి)

ఉ. హారికి నందగోకుల విహారికి చక్రసమీరదైత్య సం
హారికి భక్తదుఃఖపరిహారికి గోపనితంబ నీ మనో
హారికి దుష్టసంపదపహారికి, ఘోషకుటీపయోఘృతా
హారికి బాలకగ్రహ మహాసుర దుర్వనితా ప్రహారికిన్.

(పేజీ తిరగవేసి)

ఉ. ఆతతసేవఁ జేసెద సమస్త చరాచరభూతసృష్టి వి
జ్ఞాతకు భారతీహృదయసౌఖ్యవిధాతకు వేదరాశి ని
ర్ణేతకు దేవతానికరనేతకు కల్మషజేతకున్ నత
త్రాతకు ధాతకున్ తాపసలోక శుభప్రదాతకున్.

(పేజీ తిరగవేసి)

కం. చిత్రంబులు - త్రైలోక్య ప
విత్రంబులు భవలతాల విత్రంబులు స
న్మిత్రంబులు మనిజనవన
చైత్రంబులు విష్ణుదేవు చారిత్రంబుల్.

(పేజి తిరగవేసి)

సీ. కమనీయ శుభగాత్రు కంజాత దళనేత్రు
వసుధాకళత్రు పావన చరిత్రు
సత్యసంకల్పు నిశాచరోగ్రని కల్పు
సతతపన్నగా కల్పు నాగతల్పు
కౌస్తుభమణిభూషు గంభీర మృదుభాషు
శ్రితజనపోషు సంచితవిశేషు
నీలనీరదకాయు నిర్జితదైతేయు
ధృతపీతకౌశేయు నుతవిధేయు

గీ. నఘుమహాగదవైద్యు వేదాంతవేద్యు
దివ్యమునిసన్నుతామోదు దీర్ఘనాదు
జిష్ణు వరసద్గుణాలంక రిష్ణు గుష్ణు
జూడు దైతేయకులబాల! సుభగశీల!

(పేజీ తిరగవేసి)

సీ. పీడచే రక్కసి విగతజీవిగ జన్ను
బాలుద్రావిన మేటి బాలకుండు
వీడచే నందుని వెలదికి జగమెల్ల
ముఖమందు జూపిన ముద్దులాడు

వీడటే మందలో వెన్నలు దొంగిలి
దర్పించి మెక్కిన దాపరేడు
వీడటే యలయించి శ్వేతలమానంబు
జారలాడెన లోకసుందరుండు

తే. గీ. వీడులేకున్న పురమటవీస్థలంబు
వీనిఁ బొందని జన్మంబు విగతఫలము
వీని బల్కని వచనంబు విహరుగతము
వీని చూడని చూపులు వృధలు - వృధలు.

(పేజీ తిరగవేసి)

సీ. కమలాక్షునర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
సురరక్షకుని జూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు శిరము శిరము
విష్ణు నాకర్ణించు వీనులు వీనులు
మధువైరి దవిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదములు
పురుషోత్తమునిమీది బుద్ధి బుద్ధి

తే. గీ. దేవదేవుని జింతించు దినదినము
చక్రహస్తుని బ్రకటించు చదువు చదువు
కుంభినీధవు జెప్పెడి గురుడు గురుడు
తండ్రి హరి జేరుమనియెడి తండ్రి! తండ్రి!

(పేజీ తిరగవేసి)

సీ. కంజాక్షునకుగాని కాయంబు కాయమే
పవన గుంభితచర్మ భస్త్రిగాక
వైకుంఠు బొగడని వక్త్రంబు వక్త్రమే
ఢమఢమ ధ్వనితోడ ఢక్కగాక

హరిపూజనములేని హస్తంబు హస్తమే
తరుశాఖ నిర్మిత దర్విగాక
కమలేశు చూడని కన్నులు కన్నులే
తనుకుడ్యజాల రంధ్రములుగాక

గీ. చక్రి చింతలేని జన్మంబు జన్మమే
తరళ సలిల బుద్బుదంబుగాక
విష్ణుభక్తిలేని విబుధుండు విబుధుడే
పాదయుగముతోడి పశువుగాక !

(ఆవేశముతో) పోతన్నా !

పో :—ప్రభూ !

చిదా :—నీ జన్మ సార్థకమయినదోయీ ! కాని ఒక్కసారి నా వైపు చూచెదవా ?

పో :—చూచెదను మహాత్మా !

చిదా :—నా చేతులలోని భాగవత గ్రంథము పైపు చూడగలవా?

పో :—చూడగలను మహాత్మా !

చిదా :—ఏ మగుపడుచున్నదో చూడు ?

పో :—మహాత్మా ! నాకు దడవచ్చుచున్నది. ఆ దివ్యజ్యోతిని నాకళ్ళు భరింపలేకున్నవి. అదేదో దివ్యదర్శనము మహాత్మా ! ఆదిశక్తి సందర్శనము దేవా ? అపరసరస్వతీ సాక్షాత్కారం మహానుభావా ? గురూత్తమా ! యేల యీ పరమేశ్వరి కంటతడి పెట్టుచున్నది ?

చిదా :—పోతన్నా ! యీమెయే శారద. చదువుల తల్లి. నీ భాగవతమున తాండవించినది. నీ గంటమునం దధివాస మొనర్చినది. యీ భాగవత గ్రంథము ఆ కర్నాటప్రభువు హస్తాంకిత మగునేమో యని వగుచుచున్నది.

పో :—అయ్యో - అయ్యో - శారదమాతా - నీ కంట ఏగి పేలనమ్మా ! యీ కంటితడి నీ కేలనమ్మా !

ఉ. కాటుక కంటినీరు చనుకట్టుపయింబడ నేలనేడ్చెదో
కైటభ దైత్యమర్దనుని గాదిలి కోడల యో మదంబ! యో
హాటకగర్భురాణి నిను నాకటికిన్ గొనిపోయి యల్లక
ర్ణాట కిరాట కీచకులమ్మ త్రిశుద్ధిగనమ్మ భారతీ!

చిదా:—పోతన్నా! నీ శపథము ప్రశంసనీయమైనది. శపథమొనర్చుట సులభమే కాని శపథము నిల్పుట చాలాకష్టము. సామదానభేదదండోపాయములతో యీ భాగవతగ్రంథసంపాదనకై సర్వజ్ఞసింహుడు సన్నాహములను చేయుచునేయుండును. అందున-మీ బావ శ్రీనాథుడు రాజకవిగదా! భాగవతరుచి తెలిసిన శ్రీనాథుడు రాజునకు తెలుపకుండునా? రుచి తెలిసినపిదప సర్వజ్ఞుడు నిన్ను నిర్బంధింపకుండునా?

పోత:—నిర్బంధనలు యేమిచేయగలవు మహాత్మా! సంసారిమనందున్నను సన్యాసినైనను నన్ను యెవ్వరును యేమియు చేయజాలరు.

చిదా:—ఇది నీకు పరీక్షాసమయం - భాగవతమును ప్రభువు వారినుండి రక్షించుకొనుము - ఇదియే నా సలహా. అదియే నీకు ముక్తి మార్గము.

పోత:—చిత్తము. (నిష్క్రమణ)

గేయం.
రావె! రావె! రావె! గిరిధారీ
నీవేగదా! మమ్మేలగా
నీకన్న దిక్కెవరు యీ లోకాల
రావె రావె రావె గిరిధారీ
వెతసణగింప సుఖమును బెంప
యితరుల నే వేడనురా! హే మురవైరీ!
రావె రావె రావె గిరిధారీ!

(చిదానందుడు పాటపాడుతూ నిష్క్రమణ)

# పదియవరంగము

పోతన్న యిల్లు - (ప్రవేశం మల్లన్న – శారద)

శా :— బావా !

మల్ల :—(వెడముఖముతో అటూ ఇటూ తిరుగుతూంటాడు)

శా :—నేనేంచేశాను బావా ! అంతకోపగించుకుంటావు (దగ్గఱ చేసుతుంది)

మల్ల :—(క్రోధిస్తూ) నీవుకాకపోతే మీ నాన్న !

శా :—మా నాన్నచేసిన నేరానికి శిక్షితురాలను నేనా బావా ?

మల్ల :—ప్రపంచధర్మం అలాగే నడుస్తూంది. ఒకరు నేరస్థులు యింకొకరు శిక్షితులూ అవటం ప్రపంచసరణి కాదంటావా ?

శా :—బావా ! ప్రపంచసరణితో నా కేమీ సంబంధంలేదు. మా అమ్మ చనిపోయింది. అత్తయ్య చేరదీసింది. కన్నతల్లికన్న గారాబంగా పెంచి పెద్దదాన్నిచేసింది. నువ్వూ - నేనూ చిన్నప్పటినుంచీ సరదాగా కాలక్షేపం చేశాం. ఆనందంగా ఆటలు పాటలు పాడుకున్నాం (సిగ్గుతో) నీ మాట - నా బ్రతుకుబాట అని నమ్ముకున్నాను. (విచారించుతుంది)

మల్ల :—అంత స్వాతిశయమా ! అంత నిలాపనిందలా ! హాలికులమట ! యింత హేళన పనికిరాదు. రాజదర్బారులలో మానాభిమానము విడనాడి భళాభళీ యని పొగడే యీ రాజలకన్న తీసిపోయామా ?

గీ. ప్రకృతి సౌందర్యమునుగాంచి పరవశాన
శాంతి సుఖములను కర్షకు సాటిబ్రతుకు
యెవరికున్నది నిజముగా నీ జగాన
హేళనముసేత తేలిక యెవరికైన !

శా:—బావా! మా నాన్నగారి స్వభావము నీకు నచ్చకపో వచ్చును. నా నడవడి నీకు నచ్చలేదా – నిజంచెప్పు బావా!

మల్ల:—అహంభావంతో తూలనాడే ఆ తండ్రికూతురువు కావడమే నీ తప్పు. వ్యాసుని రాకలాగ అంతమంది శిష్యులతో పోతన్న పరువు బుగ్గిపాలుచేయడానికి – పోతన్న సంసారాన్ని నలువు రిలో నగుబాటు చేయడానికి – పోతన్నకు అమర్యాద అనుపాదించడా నికి చక్కావచ్చాడు. ఇతడేనా మా మామ! ఇతడేనా మా శ్రేయో భిలాషి శారదా! చాలు! చాలు!

శా:—భగవంతుని నమ్మినవారు పోతన్న మావయ్యా, అతనికి చెఱుపు చేనేలేదు. భగవంతుని దయలేక పాపాలు పోతాయి కాని ప్రజలు సాటివారల దయ తక్కువైనంతమాత్రం పావవుతారంటావా బావా!

మల్ల:—చాల్లే నీ వేదాంతాలు నువ్వాను. నిజంగా మా నాన్న నిష్కల్మష హృదయుడు కాబట్టి ఆ పరమేశ్వరుడు అలా సహా యంపడ్డాడు. మీ నాన్న మొహంమాడిపోయింది. ఎందుకు ఆయన కంత వృధాకోపం! ఎందుకంత శ్రమ!

సీ. చెల్లెలా రమ్మని చీరెసారెలనిచ్చి
ఆదరించెడిమాట అసలులేదు
అల్లుడా రమ్మని అతిమూల్య వస్తుల
బహుమాన మిచ్చెడి వాలులేదు
కోడలా రమ్మని కోర్కెలుదీరగా
మురిపెంబు చేకూర్చు వరుసలేదు
బావ రారమ్మని వస్త్రాభరణముల
తీసికోమని యన తెలివిలేదు

గీ॥ పాము పగనూనినట్టుల బావయిల్లు
గుల్లచేయుట – మీనాన్న – కోర్కెయేమొ!
శారదాయేల యీ పేదసన్నిధాన
వెంటసేగుము నీతండ్రి వేడ్కలూర!

(ప్రవేశం ధర్మాంబ)

ధర్మా:—(శారదను దగ్గరకుతీసి) యేవిట్రా మల్లూ - అప్పుడే పెళ్ళి అయినట్టుగానే ప్రభుత్వం చలాయిస్తున్నావు. ఆడగొడ్డుమీద!

మల్ల:—అమ్మా! నాకు పెళ్లాం వద్దనే మొరపెట్టుకుంటున్నాను. యీ పేదకొంపలో యేంయమయాతన పడతాప్రూ - వెళ్ళమ్మా - మీ నాన్నగారితో అనిచెబుతున్నా మీ ముద్దులకోడలితో!

ధర్మా:—వెళ్లక వుంటుందిట్రా వెఱ్ఱివాడా! దానికి తల్లి కొక్కర్తే లోటుగావుందిగాని యింకేవీ లేదు. (విచారించును)

మల్ల:—అమ్మా! వియ్యానికైనా కయ్యానికైనా సమానస్థి వుండాలి. బలవంతులతో సంబంధం యెప్పుడూ బలహీనులకే దెబ్బ! నా మాటవిని శారదను వాళ్ళనాన్నతో పంపెయ్యి.

ధర్మా:—"వాళ్ళనాన్న - వాళ్ళనాన్న" అంటూ తెగదెప్పు తున్నావే పోనీ మామయ్య అనకూడదట్రా మల్లూ!

మల్ల:—అనడానికి నోరురావటం లేదమ్మా. ఆయన మనకు బంధువే కాదు.

గీ. ఒక పరీక్షను చేయగా నున్నయటుల
వేదగృహమున కరుదెంచె వేలకొలది
శిష్యసంతతితోడ - మా శ్రేయమునక?
చాలు - యీ బంధుప్రేమలు - చాలునమ్మ!

ధర్మా:—నీకు నీమామయ్యమీద కోపంవుంటే ముఖాముఖిని అయన్ని నీవే అడిగితే బావుంటుంది కాని—వెఱ్ఱితల్లి నా శారదను అంటేమాత్రం నేను వూరుకోను.

మల్ల:—నేను యెవరినీ అననమ్మా. కులగౌరవం బంధుమ ర్యాద శీలసంరక్షణా, యీ విషయాలకోసం వాదిస్తున్నానే కాని వ్యక్తులపై ప్రత్యేకద్వేషాభావాన్ని ప్రదర్శించడంకోసం కాదమ్మా, మానాన్న మంత్రోపాసనాబలం కొద్దీ మామయ్యను ఓడించగలిగాము. మొన్న యేంజరిగిందో తెలుసా?

సీ. ఒకపల్లకీవాని ఒత్తిగించె నతండు
ఒకకాడీయెద్దునే నొత్తిగింప !
రెండవ కానును పొండనే నాతడు
రెండవయెద్దును లేవగొడితి !
బోయలే లేకుండె పోసచ్చెనాతడు
మన్నులే లేకుండ దున్ననాడ !
ఆకాశవీధిలో నరిగెను పల్లకి
చేలోన నాగలి చిందులాడె

గీ. వింత పెంచుట యేపాటి పెద్దతనము
అతడె అధిక్యుడనుటకా అంతబాధ !
రామభక్తుల నోడించు రాజుగలడె
కలముకన్నను మిన్నయగు హాలముతల్లి !

ధర్మా :—యెవరదరా వారికిరా మల్లూ ! లేనిపోని శంకలు పెట్టుకొని మనస్సు పాడుచేసుకోకు. నీకు అన్నివిధాల అనుకూలవతి అయిన పిల్ల శారద ! ఆమెను పెండ్లాడక తప్పదు. ఇదినాఆజ్ఞ.

మల్ల:—మనుష్యుల స్వభావాలు విమర్శించానుకాని. నీ ఆజ్ఞ జవదాటగలనా తల్లీ !



# పదకొండవ రంగము

పోతన్న యిల్లు - ప్రవేశం పోతన్న-అతని బావ శ్రీనాధుడూ.

పో :—బావా ! మీరు మీ శిష్యసముదాయముతో నా గృహ పావనము చేసినారు. మీకు నా నమశ్శతము. పేదవాడను మీకు సంతృప్తి గల్గింప నసమర్థుడను. లోపములను మన్నింప వేడుకొనుచు న్నాను బావా !

శ్రీ :—అతిథిపూజకేమి – అమితాశ్చర్యముగా జరిగినది. కాని బావా ? నాకొక కోరికయున్నది బావా ?

పో :—చెప్పు బావా? నే నెల్లప్పుడును నీ వాడనేగదా! నీ మాట కాదనగలనా?

శ్రీ :—మాటలలో కాదు బావా! చేతలలో కూడా ఆ మర్యాద గౌరవము ప్రసాదించవలె.

పో :—తప్పక బావా! యథాశక్తిగా శ్రీరామ సహాయము నంతవఱకు నీ మాటకు యెదురు చెప్పను బావా!

శ్రీ :—నేనుచెప్పేది యేదీలేదు బావా! పైగా! నేను చెప్ప దలచుకొన్నది నన్నుగురించికూడాకాదు. నీ భావిజీవితాభ్యుదయాన్ని ఆకాంక్షించి నీకీమాటలు చెప్పుతూన్నాను.

పో :—చెప్పు బావా!

శ్రీ :—నీవు సంసారివికాని సర్వసంగపరిత్యాగివి కాదు. తనకు మాలిన ధర్మమూ మొదలుచెడ్డ బేరమూ వుండదని నీకు తెలిసిన సంగతియే కదా! పెళ్ళికావలసినవాడు మల్లన్న - పెళ్ళియీడుకు వస్తున్న నీ గిరిజ. ఇంతకాలము నీ కర్ధాంగిగా యుండి కాసెడు బంగారమునకుకూడా కఱువైన నా చెల్లెలు వున్నది.

పోత :—ఔను. బావా! నీవుచెప్పినది వాస్తవమే. కాని అది వారి అదృష్టము వారు అంతేనోచుకొన్నారు. ఎవరి కర్మానుసారముగా వారి వారి జీవితములు సుఖాంతముగనో దుఃఖాంతముగనో సాగుతూవుంటాయి. అందరికర్మకూ ఒక వ్యక్తిపై బాధ్యతనిడుట యేపాటి న్యాయము బావా!

శ్రీ :—ఈ శ్రీరంగనీతులు నాకు నచ్చవు బావా!

పో :—అంతకన్న నేనేమి చేయగలను బావా!

శ్రీ :—బావా! నీకు చక్కని కవిత అలవడింది. తత్కవితా నైపుణ్యబలంతో భాగవతరచన చేశావు

సీ. కమ్మని గ్రంథంబయ్యది

యిమ్మగ నే నృపతికైన గృతినిచ్చినచో

గొమ్మని యియ్యరె వెయ్యా
ల్లిమ్మహిదున్నగనేల నిట్టి మహాత్ముల్
ఎందుచేత నలా అంటున్నానో యెఱుగుదువా బావా!

చ. అవనిపు డాదరించిన భటాళిభటుత్వము వైద్యువైద్యమున్
కవి కవితామహత్వమును గాయకు గానము కోటిసేయు న
య్యవనిపు డాదరింపని భటాళిభటుత్వము వైద్యువైద్యమున్
కవి కవితామహత్వమును గాయకు గానము గవ్వసేయునే!

పో:—బావా! (నవ్వుతూ) భాగవతము రచింపకమునుపే రామాంకితమైనది నన్ను క్షమించు బావా?

శ్రీ:—దరిద్రనారాయణసేవతో - యీ పెంకుటిళ్ళలో - విజనప్రదేశాలలో - కళావిహీనజీవితాన్ని సాగించటం యెంతమాత్రమూ యిష్టం లేదు. నీవు రచించిన భాగవతంలోని పద్యాలను మచ్చుతునకలు సర్వజ్ఞసింహునకు చదివి వినిపించేసరికి బ్రహ్మానందభరితుడయ్యాడు ఆరాజు. సబహుమానంగా నిన్ను ఆహ్వానించ సన్నద్ధుడై వున్నాడు. నీవీ భాగవతగ్రంథమును ఆమహారాజున కంకిత మిచ్చినచో నీ దరిద్రము తీరిపోవును. నామాట విను బావా!

పో:—ఈ విషయములో నేను అసమర్థుడను బావా! క్షమార్పణ వినా నేను చెప్పదగినది లేదు.

శ్రీ:—పోతన్నా సిరివచ్చే సమయంలో మోకాలు ఒడ్డు అవి వేకివి సుమా?

పో:—అంతకన్న - నన్ను నిర్బంధించకు బావా!

శ్రీ:—నీ కావ్యమే మహాకావ్యమని మురియుచున్నావు కాబోలు మీపాటి కవిత్వముచెప్పగలవారు సర్వజ్ఞుని కొలువులో లేరనుకొనుచున్నావు కాబోలు- సింహావలోకన చేయగా నీ భాగవతము తప్పుల తడకగా కన్పడుచున్నది.

పో:—(చెవులు మూసికొని) శ్రీరామ! శ్రీరామ! శ్రీరామ!

శ్రీ:—బావా - గజేంద్రుని మొరవినిన నారాయణుడు

మ. సిరికించెప్పడు శంఖ చక్ర యుగమున్ జేదోయి సంధింపడే
పరివారంబును జీర డభ్రగపతిన్ మన్నింప డాకర్ణి కాం
తర ధమ్మిల్లము చక్కనొత్తడు వివాదప్రోత్థిత శ్రీకుచో
పరిచేలాంచలమైన వీడడు గజప్రాణావనోత్సాహియై.

ఇలా నిరాయుధుడై వెళ్ళినట్లుగా రచన సాగించినావు. నీ ఆయుధములులేక అత డేమిచేయుట కేగినాడో పాఠకులు వూహించవలెనా—లేక నీ ప్రపంచజ్ఞాన శూన్యత కాశ్చర్యపడవలెనా ఇలాంటి తప్పులుకుప్పలయి వున్న భాగవతమును నీవే పోగడుకొనుట తగదు.

పో:—శ్రీరామ.

(తెరలో ధ్వని—అయ్యో శారద నూతిలో పడిపోయినది అను కేకలు)

శ్రీ:—(ఆవేశముతో) అయ్యో శారద! అయ్యోశారద!! మతిలేనట్లు అటుఇటూ తిరుగుచూ వుండును) నా శారద ఏమయింది శారదా! శారదా!! బావా పోతన్నా లేవు

పో:—బావా! నూతిలోపడిన శారదను రక్షించుటకు వెళ్ళకనే ఇలా లేచినిల్చుండి ఖంగారుపడుచున్నావేమిటి? ఆయుధములతో పనక్కర లేదూ?

శ్రీ:—బావా! పరిహాసములకిది సమయము కాదు. చెప్పుము బావా? (తొందరగా)

పో:—బావా! నీ పుత్రికపై నీ కెంత ప్రేమవున్నది. ఆమెకు ఆపదసంభవించిన మాటవిని ఆవేశముతో పరికరముల మాటలేక పోవుచున్నావు. జగత్పితయైన శ్రీమన్నారాయణుడుకూడా నీకున్న ఆవేశముతోడనే గజేంద్రుని మొరవిని రక్షించుట కేగినాడనుటలో ఆశ్చర్యమేమున్నదో వూహింపలేవా!

శ్రీ:—(నమస్కరించి) బావా! నీవు సామాన్యుడవుకావు. మహర్షివి. ఇవే నమస్కారం. నా తప్పు మన్నించు బావా!

పో:—మన్నించువాడు దేవుడుబావా! అందుచేతనే

ఉ. ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులన్
సొమ్ములు గొన్నిపుచ్చుకొని సొక్కి శరీరమువాసి కాలుచే
సమ్మెట పోటులంబడక సమ్మతి శ్రీహరికిచ్చి చెప్పె నీ
బమ్మెర పోతనామాత్యుడు భాగవతంబు జగద్ధితంబుగన్.

శ్రీ :—క్షమించుబావా ! నా అజ్ఞానానికి.

పో :—రామున కర్పించుబావా నీ క్షమార్పణ

(నిష్క్రమణ)

△

# పన్నెండవరంగము

సర్వజ్ఞసింహుని రాజమందిరము.

ప్రవేశము :—సర్వజ్ఞసింహుడు, శ్రీనాథుడు.

శ్రీ :—మహారాజా ! పోతన్నయింటినుండి ఇప్పుడే వచ్చితిని.

సర్వ :–మంచిది. కార్యమును సఫలీకృతి మొనరించుకొని వచ్చినారా ?

శ్రీ :—మహారాజా ! యేమని చెప్పగలను ! పోతన్నయిల్లూ పోతన్న పరివారము - పోతన్నా – రామనామాంకితమై మానవుల మాటనే యేమరుపాటుగనుచున్నారు. రాజా !

సీ. ఏవైపు చూచిన హేరామ ! యనుమాట
వీనులవిందుగా వినగదగును !
ఏదిశన్ గన్నను యీ రామభజనంబె
కన్నులకింపుగా గాంచనగును !
ఏమూలచూచినన్ యీరామచిత్రాల
కారాధనంబులు గానగనుచు !
ఏపేరు నడిగిన యీ రామనామమే
చెవులలోపడును విస్మితులుగాగ !

గీ. ఏకశిల నగరంబు చీకాకు లేని
రామనగరంబుగా మారె రాజరాజ!
దివ్యఋషివోలె పోతన్న భవ్యబోధ
చేయుచున్నాడు సిరులన్న హేయపడుచు!

సర్వ:—శ్రీనాధ కవిరాజా! ఇదియేనా మీ కార్యజ్ఞత (హేళనగా)

సీ. అగుపించు స్త్రీలపై అత్యద్భుతంబుగా
పద్యాల నల్లిన పరమ రసిక!
గౌడ డిండిమభట్టు కంచు ఢక్కనుబట్టి
చీల్చి గెల్చినకవి శేఖరుండ!
ఘనతర నైషధ గ్రంథంబు రచియించి
పేరునిల్పుకొనిన సుధీమూర్తి!
ఆస్థాన కవివని అఖిలాంధ్రదేశాన
అభినుతిన్ గొన్నట్టి ఆంధ్రవిష్ణ!

గీ. ఇంతియా కాబోలు తెలివి! పంపగించి
ఒక్కనిరుపేదకవికి సమ్మోహనాస్త్ర
బంధితునివోలె చేయగా సాధ్యపడితి!
శక్తి యీపాటిదా! కవిసార్వభౌమ!

శ్రీ:—మహారాజా! రాజుల సమ్మోహనాస్త్రములు యోగి పుంగవులపైననా? సర్వసంగపరిత్యాగియై ఐహిక సుఖముల కాసక్తి లేక పరమేశ్వర ధ్యానస్థుడై పరిచింతనలో నలరారు యీ పోతన్నను యే ప్రభుశక్తియు పరాభవింపజాలదు

సీ. అగ్రహారములు అతిచమత్కారాన
పురిగొల్పినన్ ఆశ పుట్టలేదు
భూషణాంబరములు పొందు మాటను జెప్ప
చోద్యంబుగానైన చూడలేదు

కామినీగుణముల కాన్కల నుడులకు
హితవన్న కీర్తి కన్పించ లేదు
వాహన భాగ్యంబు బహుమానమన్నను
రివ్వంతకోరిక రగుల లేదు
గీ. కోరికలు లేక రాముడే గుహుడటంచు
రామునామమె ఆహార రాజమనుచు
యోగియన్నట్లు పోతన్న యున్నయప్పుడు
మెరిక్ల బండాల వేసిన నేమిఫలము?

సర్వ:—శ్రీనాథా! మీ ధోరణి నాకు నచ్చలేదు.

శ్రీ:—మహారాజా! మీరు అంతిగా చులకన చూచినచో నే నేమియు చేయజాలను. ఏకశిలానగరమును ప్రవేశించినది మొదలుగా గల గాథను మీకు సవిస్తరముగా విన్నవించెదను. సాకల్యంబుగా నామనవిని నా నిర్దోషత్వమును ధృవపఱుచును.

సర్వ:—శ్రీనాథకవిరాజా! భాగవత గ్రంథమును పోతన్న విరచించినాడని నాకు తెలియజేసినది మీరేగదా! అందలి మాధుర్య పద్యాలను వీనులవిందుగా వినిపించినవారునూ మీరేగదా! ఆశ గల్పించినారు. నిరాశకు నీడల గల్పించుచున్నారు. నిరాశను లెక్క చేయనుకాని పట్టుదల యింతియేనా? బలశౌర్యములు యింతియేనా? ప్రభుపరాక్రమ మింతియేనా? అని శంకించుచున్నాను.

సీ. ప్రభువు లడుగకుండ! భవ్యాంబరాలను
కానుక లర్పించు గణ్యతములు!
ప్రభువు లడుగకుండ వస్తుసంతతులెన్నొ
బహుమాన మనిగొని వచ్చు ఘనులు!
ప్రభువు లడుగకుండ వాహనని చయమున్
సంతసంబున నిడ జూచు విదులు!
ప్రభువు లడుగకుండ ప్రథనింపు కావ్యాల
అంకితం బిడవచ్చు నట్టి కవులు!

గీ. రాజ్యమందుండ—ముద్దుగా రమ్మటంచు
కావ్యకానుక తెమ్మంచు గారవమున
పల్కినందుకు కాబోలు పంతమింతి
పోతరాజుకు గల్గె! సంపూతచరిత!

శ్రీ :—మహారాజా! నా మనవి వినుము!

గీ. వంశమందిని గొంపోతి విందుకనుచు
అయ్యవారల నట్టిల్లు యనగనున్న
పోతనార్యుని యింటికి! భూతలేంద్ర!
అపటిగాథను విన్నచో అబ్బురంబు!

గీ. స్నానమును జేసి వచ్చిన సమయమునను
వంటకాలన్న మాటలే - యింట లేవు!
వండుటకు లేదు - రాజ! రవ్వంత వినుము!
కాంచలేనట్టి చిత్రంబు కనులగట్టె!

సీ. వంటయే లేకుండ వర్ణింపలేనన్ని
భోజన వస్తువుల్ పొలుపు నిలిపె!
ఇతరసహాయంబు లెంతేయు లేకుండ
వివిధరుచుల దెల్పె వింజిచంట!
ధనికులకైనను ధాత్రీశులకునైన
అందని వెనుకీవి చిందులాడె!
ఎంతమందికినైన యింటలోట లేనట్లు
ఆహారములుకుప్ప లైనవచట!

గీ. శిష్యసంతతి విందును చిన్మయముగ
ఆరగించిన వెన్క అడుగిడ నేరరైరి
సిగ్గుపడినాడ నాలోన క్షితికులేంద్ర!
భక్తులకుతోడు - పరమేశుశక్తి - రాజ!

సర్వ :—కవిరాజా! యీ భద్రరాజుపొగడ్తలను కట్టిపెట్టుడు. పొగడ్త యనునది కవీశులకు జననంబుతోనున్న గుణము. కాని యీ

గుణమే ఒకొక్కప్పుడు దుర్గుణమై రసాభాసుచేయును. సాధారణముగా కవులు

సీ. ఇంద్రుడు! చంద్రుడు యీమహాత్ముండని
భూపతి కెదురుగా పొగడి! పొగడి!!
దానకర్ణుండనుచు దరిలేని శైలితో
ప్రభువుసన్నిధాన పలికి! పలికి!!
శూరసన్నుతుండు శోచనీయంబుగా
క్షితికాలతుముంగిట చెప్పి! చెప్పి!!
జాతికిజ్యోతి - భూజానియనురీతి
వసుధేశుచెంతను పాడి! పాడి!!
గీ. పాత్రతకు మించు రచనల వ్రాయువారు
పనులు తీరిన సంతోష పడెడివారు
కానివేళల దుర్మోత్త గలుగువారు
కవులు - మహనీయులౌదురో! శుకకవీంద్ర!!

శ్రీ:—సర్వజ్ఞసింగభూపాలా! నమ్మినను, నమ్మకపోయినను నేను చేసెడిదిలేదు. దరిద్రనారాయణ సేవతో పాడుకొంపలో నున్న పోతన్నకు పదిమందిని గొంపోయి దండిడమనిచెప్పి గుణపాఠమును బోధించి ధనము సర్వార్థములకు ప్రధానసాధనమని నిరూపించ నెంచితిని. కాని మానవబలముకన్న పోతన్నకు దైవబలము అపరిమితముగానున్నది. వానిని మనమేమియు చేయజాలము మహారాజా!

సర్వ:—రాజులా-కవిరాజులూ! చేయగల్గిన దింతియేనా?

శ్రీ:—తుదకు నీ భాగవతము యేదో సద్గ్రంథమనీ - అలభ్యగ్రంథమని అపోహవలదనీ - అది తప్పులతడకయనీ-విమర్శకులు విన్న రసాభాసు కాగలదని యేమోవచించితిని. పోతన్నా! నీపై ప్రభువులకు గల అవ్యాజప్రేమయే యీ భాగవతమును వారి కంకితమిమ్మని ప్రోత్సహించుచున్నది. నీ పాటికవులు - యీపాటి గ్రంథమూ సర్వజ్ఞసింగనరేంద్రులకు లభ్యము కాకపోవునా? అనికూడా పల్కితినికాని-

సర్వ :— ఏమి - కాసీ - అని ఆగినారు ?

శ్రీ :— ఏమిచెప్పను మహారాజా! అవమానమున కాహుతి అయినాను. మారు వచింపలేకపోయినాను. అతని వచోరచనకు ప్రతిభకు భాగవత శక్తికి దాసుడనైపోయినాను ప్రభూ !

సర్వ :— ఇది సర్వాబద్ధం. మీరు ప్రబోధనచేసినారు. గ్రంథ విమర్శన చేసినారు. విమర్శన వ్యక్తిగతముగా చేయలేదు. నవరసములు వాని స్థాయీభావాలు. పాత్రపోషణ - పాత్రౌచితి - శబ్దప్రయోగం వీటిని పురస్కరించుకొని చేసిన సంభాషణలో అవమానమునకు అవకాశమేలేదు, మీరు అవమానపడినట్లు చెప్పట - ఇదియేదో పుక్కిటి పురాణమువలె నున్నది.

శ్రీ :— మహారాజా! అదికాదు. సందర్భమును విని క్షమింప గోరెదను.

సర్వ :— అన్నిసందర్భములను వినుటకు సన్నద్ధుడనై యున్నాను సెలవిండు !

శ్రీ :— భాగవతములో గజేంద్రమోక్ష ఘట్టములో పోతన్న ఒకపద్యము రచించినాడు. అది యిది.

మ. సిరికిం జెప్పడు శంఖచక్ర యుగమున్ జేదోయి సంధింపడే
పరివారంబును జీర డభ్రగపతిన్ మన్నింపడా కర్ణికాం
తర ధమ్మిల్లము చక్కనొత్తడు వివాద ప్రోద్ధతి శ్రీకుచో
పరిచేలాంచలమైన వీడడు - గజప్రాణావనోత్సాహియై !

సర్వ :— చాలా హృద్యముగా నున్నది. దీనిని మీరెట్లు విమర్శించినారో మనవి చేసెదరా ?

శ్రీ :— మహారాజా! నేనిట్లంటిని. మకరిబాధవలన జవసత్వములు గోల్పోయి - అహంకార మమకారములు విడనాడి - గజేంద్రుడు పరమేశ్వరునకు ఆత్మార్పణచేసినాడు. అల వైకుంఠపురంబులో నున్న చక్రికి గజేంద్రుని మొర వినిపించినది. వెనువెంటనే యిట్లు బయు

లు దేరినాడట - ఆయుధాలైన శంఖుచక్రాలను చేదోయిసంధిపండట - పరివారములను పిలువడట - గరుడవాహనము నైనను కాంక్షించ లేదట - ఆసక్కిణికోక కొంగునైనను విడుచుట మఱచినాడట - ఇదం తయూ విపద్వారముతో నున్న గజరాజును కాపాడుట కేనట!

సర్వ :—తాత్పర్యము బాగాశలవిచ్చినారు. మీరు విమర్శిం చిన లోపమేదో శలవివ్వండరా?

శ్రీ :—శలవిచ్చుట కేమున్నది. ఆపద్యమును సామాన్యదృష్టితో చూచినానే గాని ప్రపంచానుభవము ధర్మచింతతో చూడలేదు మహారాజా!

సర్వ :—అదేమి? అట్లు నిరుత్సాహపడినారే?

శ్రీ :—నేను చూపించిన లోపము ఇది. మరి నిరీక్షించి - కరిని రక్షించనేగినే రమాకాంతుడు నిరాయుధుడై - పరివారహీనుడై యేమి చేయగలడు. ఇది రసాభాసుకాదా అని ప్రశ్నించితిని.

సర్వ :—బాగుగానే అడిగినారు?

వెంటనే ఒక కేక యిల్లో వినిపించినది. నా యేకైకపుత్రిక ముద్దులబిడ్డ - నూతిలో పడినదని!

సర్వ :—అయ్యో - నిజమేనా? తర్వాతయేమైనది.

శ్రీ :—అమాటవిన్నంతనే పిచ్చివానివలె - మతిహీనుడనై - బావా? బావా యనుచును - శారదా - శారదా - అనుచును కేకలు వైచి అటూ యిటూ తిరుగుతు ఆతురతతో బావివైపుకు పోవు చున్నాను. అప్పుడు మాబావగారు పోతన్న నన్నాపి బావా! నూతి లోపడిన నీకుమార్తెను తీయుటకు పరికరములులేక యిట్లుగుచువ్వావే- యేమిసేయుటకయ్యా? అని చెప్పినాడు. బావా పరసములకిది సమ యము కాదని శారద - శారదా - శారదా! అని పరుగుచు కాలం పెం చితిని. పుత్రికాప్రేమతో - కడుపుతీపితో -

సర్వ :—ఇందులో అవమాన మేమున్నది.

శ్రీ:—అప్పుడు పోతన్న బావా! నీ కుమార్తె సురక్షితముగా నున్నది. నీ కొరకు గుణపాఠము బోధించుటకై యిటుచేసినాను. మానవ సాంబధ్యము క్షణికము. అట్టి క్షణిక ప్రేమను, వాత్సల్యమును పురస్కరించుకొని నీ కుమార్తె కాపద సంభవించిన దనుమాట వినగానే శాంతి లేనివాడవై శారదా! శారదా! అను విభ్రమాంకిత వచనాలతో బావికడకు పరిసర హీనుడవై పయనమైనావు. ఏమిచేయుటకు బావిలో పడిన పిల్లనుతీయుటకు పగ్గాలమాట మఱచినావే: బావా! ఒక పిల్ల తండ్రివైన నీకు యెంత పుత్రికావాత్సల్యమున్నదో జగత్పితయైన ఆ పరమేశ్వరునకు యెన్నెన్ని వాత్సల్యముండదా? భక్తసంతతికి యిక్కట్లు సంభవించినపుడు ఆయన మనోక్లేశ మనుభవింపడా? కాపాడుటకు నెనువెంటనే పయనముకాడా - ప్రాహింపలేడా? అని కుక్కలాయనకు చెప్పచెబ్బరలిగా బదులుచెప్పినాడు

గీ. రామభక్తుల నెదిరించి రాజ! రాజ!
గెలుపు నిలుపగనేరికి యలవియగును
ఆతని వాగ్ధోరణిని విని అంజలించి
తప్పు మన్నించమని యంటిపప్పు షికలు!

సర్వ:—సామదానభేద దండోపాయములవలన పోతన్నను బలాత్కరించి భాగవతమును నా స్వాధీనము చేసికొందును. నాను భక్తియో ప్రభుశక్తియో యేది ఘనతరమో తెలవదా.

శ్రీ:—రాజా! మీరు భ్రమపడుచున్నారు.

గీ. ప్రభుల సృష్టించగల్గిన రామభక్తి
ప్రజలకాపాడ నున్నట్టి రామభక్త
ప్రభులశక్తిని గూల్చెడి రామభక్త
మహిమ తెలపోయవేమది మాననీయ!

సర్వ:—ఈ వేదాంతము కార్యజ్ఞతకు చేడపురుగు - యిట్టి మెట్టవేదాంతములను సదా ఆరాధించినజాతి కాలగర్భములో నామ మాత్రావశిష్టమై కళకాంతులు లేకయుండును. నా ప్రతిభను మీరు కన్నులార చూచెదరుగాక. (నిష్క్రమణ)

# పదమూడవ రంగము

పోతన్న ఇల్లు - ప్రవేశం - పోతన్న మఱికొందరు భక్తులు.

భజన గీతము.

దీనజనావనా ! పావనా
నీ నామమెగద మా ఆరాధన !
దీనజనావనా ! పావనా !
ఆశ్రితపోషణ అఖిలాభరణ
ఆశ్రయించితిమి ఆదరింపుమిక !
దీనజనావనా ! పావనా !

పో :—మహాజనులారా ! యీదినమున గజేంద్రమోక్షములో మిగిలిన ఘట్టమును చదివి వినిపించెదను. ఆకర్ణించెదరా ?

భ :—చిత్తం. మా ప్రభూ ! వినిపించుండి !

పో :—గతదినంబున గజేంద్రుడు శక్తియున్నంతవరకు మకరితో పోరాడినంతవఱకు కధసాగింది. అనంతరగాధను ఆరంభించెదను

భ :—సదువించండి మారాజా !

పో :—పాపం ! గజరాజు మకరిబాధను సహించలేక నీరసపడి నిరుత్సాహంగా వున్నను ఈ మాయమొసలి నాకొఱకే అవతరించి నదా అని అనుకున్నదికూడా పాపం. ఆలోచించి ఆలోచించి పరమేశ్వరుని స్తుతించాడు ఇలా ;

ఉ. ఎవ్వనిచే జనించు జగ మెవ్వనిలోపలనుండు లీనమై
యెవ్వని యందుడిందు పరమేశ్వరుడెవ్వడు మూలకారణం
బెవ్వడనాది మధ్యలయుడెవ్వడు సర్వము దానయైనవా
డెవ్వడు వానినాత్మభవు నీశ్వరునే శరణంబు వేడెదన్.

క. ఒకపరి గజముల వెలినిడి
యొకపరి లోపలికి గొనుచును భయము గనుచున్

సకలార్థ సాక్షియగు న
య్యకలంకుని నాత్మమయుని నర్థింతు మదిన్.

క. లోకంబులు లోకేశులు
లోకస్థులు తెగిన తుదినలోకంబగు పెం
జీకటి నెవ్వడు వెలిగెడు
నేకాకృతితోడ నతని నే సేవింతున్

ఆ. ముక్త సంగులైన మునులు దిదృక్షులు
సర్వభూతహితులు సాధుచిత్తు
ల సదృశవ్రతాఢ్యులై కొల్తురెవ్వని
దివ్యపదమువాడు దిక్కునాకు !

(ప్రవేశము - రాజభటులు)

రాజభ :—ఏనండీ పోతన్నగారి యిల్లుయిదేనా ?

భ :—ఔనండీ. పోతన్నగారి యిల్లుయిదే. ఆమహాత్ముడే పోతన్నగారంటే.

రా :—ఓహో !

పో : — (నమస్కరించి) మహాజనులారా ! యేల యీ పోతన్న పేరను అడుగుచున్నారు ?

రా :—అడుగదలచి అడుగుచున్నాము.

పో : — కారణము తెలియవచ్చునా ?

రా :—రాజమార్తాండులు - బలపరాక్రమ విభవోన్నతులును వివిధవిద్యాభాషా పరిపూర్ణులును - పండితసమాదరణ దక్షులును - సరాష్ట్ర స్వపరిపాలనాతంత్రులును - ప్రజారంజనీయమాన ధర్మసంస్థాపనాది దిగంతవిశ్రాంతికీర్తిప్రశస్తులును సంతతసంతాన సంపత్సమేతులును నగు శ్రీ శ్రీ శ్రీ సర్వజ్ఞసింహభూపాల సందేశమును వినిపింపవచ్చిన రాజభటులము

పో :—మహాత్ములారా! దయచేయుడు. మీరాకవలన నా గృహము పావనమైనది. రాజుగారి అనుగ్రహమునకు పాత్రమైన నేను కడుంగడు ధన్యుడనని గర్వించుచున్నాను.

రా :—(కాగితంతీసి చదువును) శ్రీశ్రీ బమ్మెర పోతరాజు కవిశేఖరులకు అభివందన పూర్వకముగా, శ్రీశ్రీశ్రీ సర్వజ్ఞసింహ నరేంద్రులు పంపిన సందేశము. మీరు వ్రాసిన భాగవత కావ్యమును వినవలెనని మాకు కుతూహలముగానున్నది. అందలి మధురమైన పద్యాలను మీరేచదువగా వినవలెనని మా దర్బారువారి అభిలాషమై యున్నది. లోగడ భోగినీ దండకరచనను అంకితమిచ్చి మా రాచమర్యాదలను స్వీకరించిన మీరు మా కోరికను తీర్చవలెనని, తీర్చగలరని ఆశించుచున్నాను. సుముహూర్తము చూచికొని వెంటనే మిమ్ములను బహుమాన పురస్సరముగా సత్కరించి తద్గ్రంథమును అంకితము గొననుత్సాహపడుచున్నాను. మునుముందుగా భాగవతముతో బయలుదేరి రాచనగరునకు మీరు విచ్చేయవలెనని రాజాజ్ఞ.

పో :—మహాశయులారా! సర్వజ్ఞసింహభూపాలుర ఆజ్ఞవిన్నాను కాని అసమర్థుడనైన నేను రాజాజ్ఞను పాలింపలేనందుకు విచారించుచున్నాను.

రా :—అలా అంటారేం. ప్రభువుల ఆజ్ఞలంటే మీరు భయపడరా! అక్షరాలా అనుసరించడానికి సందేహిస్తారా!

పో :—నాయనలారా! మానవుడు భయపడవలసినది రెంటికే. ముందర దేవునకు. తరువాత పాపమునకు. యింక ప్రపంచములో దేనికీ హడలిపోనక్కరలేదు.

రా :—అలాగైతే రాజాజ్ఞను ఉల్లంఘించడం పాపంకాదా?

పో :—రాజులు ఒకప్పుడు స్వార్థపరిత్వంతో న్యాయాన్ని గుర్తించలేక, ధర్మాన్నిపాటించలేక, తప్పటడుగులు వేస్తారు! అందువల్ల తన ఆత్మ తనకార్యమే న్యాయమని ప్రబోధించినప్పుడు ప్రభువు పట్టుదలను లెక్కచేయక పోవచ్చు. ఇలాంటివి వుండుటవల్లనేకదా

'రాజాంతే నరకంధృవమ్' అన్నారు పెద్దలు. అంటే రాజుగతించిన తరువాత కష్టభూయిష్టమైన నరకకూప సందర్శనంచేస్తాడు కాని స్వర్గసీమకు పోవడానికి అర్హుడుకాడు!

రా : — పోతన్నగారూ! మీ మెట్టవేదాంతాలతో మాకేమీ పనిలేదు. సామదానభేదదండోపాయాలను ఉపయోగించి మిమ్మల్ని భాగవతగ్రంథంతో సహా దర్బారుకు తీసుకొని రమ్మనమని ప్రభువుల వారి ఆనతి. ఒకవేళమీరు పంతగించి, బెట్టుచేసి, రాజాజ్ఞను తిరస్కరించే పక్షమున, భాగవతగ్రంథమును అయినా తీసుకొని రమ్మని ఆజ్ఞ. దీనికేమందురు?

పో :—నాయనలారా! మీకైనను, మీ ప్రభువులకైనను ఇది కోరరాని కోరిక.

గీ. పోతరాయని గుండెలో వ్రాసియట్టి
భాగవతము యీయగావలను పదుగ!
రాముడున్నాడు నాగ్రంథరాజమందు
దక్కనీయను ప్రభులన్న లెక్కలేదు!

గీ. వలపు నీయని కాంతను పిలుచువాడు
కవితచూపని కవులను గాంచువాడు
వెలుగు లతికను పిచ్చిగా విరుచువాడు
వట్టి మతిలేనివా డనవలయునయ్య!

మీ రాజుగారితో యీ విధముగా తెలవిండు!

సీ. ప్రభువుల ఆజ్ఞను ప్రతిఘటించెడిరీతి
కలనైన నెన్నడు తలచలేదు!
ప్రభువుల కోరిక భంగపుచ్చెడిబాట
సరదాకునైనను నెరుగలేదు!
ప్రభువుల మాటల పరుసుతనంబుగా
యొంచెడిదారి సహించలేదు!

ప్రభువుల నదరికి వచ్చుటయన్నను
యిష్టంబుకాదని యెంచలేదు !
గీ. కాని నాకున్న వైరాగ్య కారణాన
రామభజనంబుకన్న వేరన్న యెడల
మనసు కడు బాధనొందును – మహినిగల్గు
సుఖసంతతులకు ఆశ సున్న ! యన్న !

నేను భాగవతము ఒక ప్రభువుకోసమై వ్రాయలేదు. ప్రభువులు నన్ను భాగవతంరచించమని యెన్నడును కోరలేదు. జగత్ప్రభువు భాగవతము రచించి తన కంకితమిమ్మని కోరినాడు. ఆజ్ఞాపించినాడు. కవిత్వాస్రవంతిని కల్పించినాడు. గ్రంథరచనకు సహాయపడినాడు. ఆ మహాత్ముని - ఆ సీతారమణుని – దశరథనందనుని కరుణారతివల్లనే నా భాగవతము సంపూర్ణమైనది. అప్పుడే అంకితమీయబడిన భాగవతమునకు మరల అంకితమీయుడని అడుగు సర్వజ్ఞసింగు భూకాంతుల వచనము విస్మయమగుచున్నది. క్షమింపుడని చెప్పుడు.

రా :— అంతటితో వదలువారము కామయ్యా ! బలాత్కారముగా మీ యింట్లో ప్రవేశించి ఆభాగవతాన్ని గొంపోతాం – యెక్కడ వున్నదో చెప్పెదవా ? లేక శిక్షించమందువా ?

పో :— ఇంత దౌర్జన్యమా? రంజింపజేయువాడే రాజుగదా ? రామచంద్రా ! ఎంత ఘోరకలిసాగించుచున్నావు ప్రభూ !

సీ. ప్రభువులేయన్యాయవర్తన చూపుచో
ప్రజలయిక్కట్లు యెవ్వరికి యెఱుక !
రాజులే ధర్మంబు రహితంబుగాచూప
జనులబాధలు వినజాలునెవడు !
భూకాంతులే స్వార్థపుందారి నడచిన
పాపాలకున్ శిక్షపడునదెవడు
క్షితిపులే ఆశతో చింతలన్ గూర్చుచో
మొరలను వినుట కెవ్వరుడుగలడు ?

గీ. కంచెయే చేనుమేసిన గలదెదిక్కు-
ఘనసముద్రుడే పొంగిన గలదెగట్టు?
భక్తులను హింసచేయుట పాడిగాదు
అనుచు చెల్పుడు ప్రభువుతో ఆర్యులార!

రా :—అలా చేయడానికి వీలులేదు. తత్ క్షణం మీయింట్లో వున్న భాగవతాన్ని మాకు స్వాధీనం చెయ్యాలి లేనిచో ప్రభుబలం దాన్ని స్వాధీనం చేసుకుంటుంది.

పో :—అంత తేలికకాదు నాయనలారా!

గీ. కాచుచున్నాడు రాముడు గ్రంథమెపుడు
ఆ మహాత్ముని యోడింప నెవ్వడెవడు
బలము మీకున్న - యోధులై వరలుచున్న
వెళ్ళుడా యింటికిప్పుడే విజ్ఞులార!

భ :—(ఆవేశముతో) ఏయ్ - ఆగు ఆయన మీ రాజుకే అపకారం చేశాడు. ఆయన గ్రంథాన్ని అలా అన్యాయంగా అపహరించడం మీ రాజుకు ధర్మమేనా? ప్రజలంతా ఒప్పుకొనే పద్ధతిలో ప్రజలందరికీ సంతోషమయ్యే పద్ధతిలో పాలించినవాడే రాజు. ప్రజలకు మీపని మాకెంతమాత్రమూ యిష్టంలేదు. మీరు మర్యాదగా యింటికి వెళ్ళండి. అన్యాయంగా ప్రవర్తించే మీ రాజుతో యిలాంటిపని పనికి రాదని చెప్పండి. మర్యాదగా వెళ్ళితే వెళ్ళండి. లేదా పోతన్నగారి కోసం - పోతన్నగారి భాగవత గ్రంథాన్ని సురక్షితం చేయడంకోసం మా జీవితాలను త్యాగంచేయడానికి సిద్ధంగావున్నాము. ఎప్పుడూ ఏ ప్రభువులూ యివ్వలేని జ్ఞానభిక్షను మా పోతన్నగారు మాకు పెట్టారు. ఆయనకు జరిగే అపచారం యీ ఏకశిలానగరవాస్తవ్యు లందరకూ జరిగే అపచారంగా పరిగణింపబడుతుంది.

రా :—మీరు రాజాజ్ఞకు లోబడకపోతే రక్తప్రవాహాలు ప్రవహిస్తాయి. ప్రాణాలను బలి యీయవలసివస్తుంది.

పో: —భక్తులారా ! మీరు పశుబలమును ప్రయోగింపవలదు. మానవునకును, పశువులకును తేడాయున్నది. హింసాతత్వమే పశుప్రవృత్తి. అహింసాదీక్షయే మానవమతము. సత్యప్రవర్తన సత్యవ్రతము అహింసాప్రబోధము. అహింసాచరణము వున్నమానవుడే సర్వదాపూజింపబడగలడు. అతడే ప్రజలలో నీటికీకీటములు కాగలడు. మకుటము లేని మహాప్రభువు కాగలడు. యీ రాజులు రాజులా - బుద్ధరాజులు కాక అన్నట్లు అందరూ రాజులు కానేరరు. ఈ రాజభటులపై మీరు దూషణతిరస్కారముల సాగింపవలదు. హింసపద్ధతుల ప్రయోగింపవలదు. ఎవరికర్మ ముబట్టి వారికి బుద్ధులు పుట్టుట సహజమునాయినా !

రా :—(తిరస్కారముతో గృహప్రవేశము చేయును)

భ :—బాబూ మీ ధర్మపీఠ ఠాంనియాశవగిన దేనా ? పరువు నశిస్తూన్నప్పుడు, ఏదుటనున్న అధమాధముడు అధర్మముగా అపహరిస్తూన్నప్పుడూ సత్యము ! అహింస ! ! అని మడిగట్టుకొన్నచో యెట్లు మహానుభావా ?

పో :—(ఏదురుగా చూచును)

(ప్రవేశము - ధర్మాంబ - శారద - గిరిజ)

ముగ్గురు :— దౌర్జన్యముగా రాజభటులు పూజామందిరములో ప్రవేశించి భాగవతము, భాగవతము అని అరుచుచున్నారు.

పో :—రాముడే రచించమని ఆజ్ఞనిచ్చినప్పుడు రాముడేతనకా గ్రంథమును అంకితమిమ్మని ఆజ్ఞాపించినప్పుడు ఆకార్యమును రక్షించు బాధ్యత, కావ్యాపహరణకై యత్నమును జనుల శిక్షించుబాధ్యత ఆరామచంద్రునిదే. మీరు వృధాగా మనోక్లేశమనుభవించకుడు.

(ఆవేశముతో మల్లన్న ప్రవేశం)

మల్ల :—నాన్నగారూ ! మన్నించండి. యింక నేని దురంతాన్ని సహించలేను. ఎవరా రాజభటులు. ఎక్కడున్నారు. మనభాగవతమును అపహరించుటకు వారికెవరు హక్కునిచ్చారు. వెంటనే చెప్పండి నాన్నగారూ. ఇదంబ్రాహ్మ్యం - ఇతిక్షాత్రం అని చెప్పాలి.

గీ. పప్పుదిను బాపనయ్యల భాగవతము
అంత తెలిక యనుకొనినావె రాజు!
రక్తవాహిని ప్రవహించులాగు నిచట
భండనముసేయ సామర్థ్య మందునేని
రండు యెక్కడ నుండిరో రాజభటులు
వీరరక్తము మాది - చల్లార లేదు!

భ:—మేము యిదివఱకే నాన్నగారితో చెప్పినాము దొరా! యీ రాజభటులను యింతసేపటివఱకు వుంచేవాళ్ళమా? అయ్యగారి శెలవైందంటె అజామత్తు చేశేయ్యమా దొరా!

పో:—మీరందరూ వృథాయాస పడుచున్నారు. దౌర్జన్యమును రగుల్కొల్పుచున్నారు. శరీరమునకు శత్రువు క్రోధము. దానిని యే మానవుడు ఆహ్వానించకూడదు. రామునియందు నమ్మకమున్న వాడను నేను. రామాంకితమైనది నా గ్రంథము. రాముడే యున్నచో భాగవతమునకు సంరక్షణసిద్ధి యుండును. మీరూ నేనూ యీ అమాయక రాజభటులపై పగగొన పనిలేదు. వీరు ఉదరపోషణ నిమిత్తమె శరీరమును అమ్ముకొనిన బానిసలు. (ఎదురుగా) అరుగో! గాయపడి నెత్తుటిధారలతో యీ భారతవీరులు యిటు నిరుత్సాహముతో వచ్చుచున్నారు అయ్యో పాపం! ధర్మాంబా వీరలకు పరిచారములు చేయవలెను రండు.

(ప్రవేశం - గాయపడి రక్తధారలతో రాజభటులు)

పో:—నాయనలారా! మీరందరూ రక్తసిక్త గాత్రులై యేలయిట్లు బాధపడుచున్నారు.

రా:—మహాత్మా! (వణుకుతూ హీనస్వరంగా) అపూజామందిరంలోకి వెళ్ళేసరికి పెద్దకోతి తోకనుమెడకు చుట్టేసి టక్కీలుమని - (ఆయాసంతో) నేలనేసి కొట్టేసిందిబాబూ - కొనవూపిరితో యిలా బయటపడ్డాం - అదేపిశాచమో యిదేంపిడ్డూరమో! యెవ్వరూ యెరగంబాబూ.

(అందరూ పరిచర్యచేస్తూంటారు)

శిక్షించేవాళ్ళని రక్షించారుబాబూ పోతన్నగారూ మీరు నిజంగా మహాత్ములు మీభాగవతం మానవలభ్యంకాలేనిది.

పో :—ఆయాసపడకండి నాయనా ! ఆపెద్దకోతి ఆంజనేయుడు రామభక్తుడు. భాగవతగ్రంధమునకు పహరాగాచు భక్తుడు ఆతని క్రోధమునకు బలియైన అభాగ్యులుమీరు. రామనామసంకీర్తన చేసి నచో ఆతని కోపము తీరును. మీబాధలు తీరగలవు.

గీ. రామనామము సర్వదారక్తిమీర
పఠనచేసెడివారికే బాధలేదు !
కర్మగానివచ్చి మీకు నిక్కముగలగూర్చు
వగచి చేసెదిదింకేది భక్తులార !

అందరు రఘుపతినామ స్మరణచేసినచో మనశ్శాంతి యుండ గలదు.

గేయం.

నీదాసులము నిర్మలరాం
ఆదరింపవే దశరధరాం
సీతావల్లభ రాజారాం
జేరిభజింతుము శ్రీకరరాం
భక్తపాలనా పావనరాం
శక్తిహీనులము సీతారాం
ఆర్తశరణ్యా అయోధ్యరాం
కీర్తిశాలివో జానకిరాం.

(అందరు నిష్క్రమణ)

△

# పదునాలగవరంగము

సర్వజ్ఞసింహుని ప్రత్యేకమందిరము.

ప్రవేశము సర్వజ్ఞసింహుడు - శ్రీనాథుడు.

శ్రీ :—మహారాజా ! రాణిరమణికై యోచించునట్లుగా, తమరు వృథాగా మనస్సును పాడుచేసుకొనుచున్నారు. పోతన్నను బాధించుచున్నారు. తమకు చెప్పజాలను కాని, ప్రభూ ! యీ విషయమును యింతటితో ముగించినచో మంచిదని నా ప్రూహ !

గీ. ఇట్టి మహనీయ రచయిత యీ విశాల
రాజ్యమందున చూప నలభ్య మనుచు
యెంచినారేమొ ! ప్రభువులు !—కించ లేక
పోతనార్యుని విమల సంపూర్ణ చరిత !

గీ. అతని భాగవతమును, వెయ్యాసు గతుల
మించి మురిపించజాలిన మంచికృతులు
ప్రభువు వరియించి కలికించ—వరుస నిలుచు
సమ్మతించినచాలు ! వర్షంబె కురియు !

సర్వ :—నా పంతము నిరాశాంతముగానే అంతమొందవలసినదేనా ?

సీ. ఎదిరించు శత్రుల మదమడంచెడి ధాక
ఒక పేదకవికి దాసోహమనుట !
నిలిచి బల్కినవాని నేలగూల్చెడి శక్తి
పోతన్న నణగింప బోవుకుంట !
ఆజ్ఞ నుల్లంఘించు నతనిచంపెడి కవి
యీ మాయయోగికి యేలకుంట !
అంకితం బిమ్మని అడిగి కైకొను ప్రభ
హాలికుదరినేము అణగియుంట !

గీ. చూచి సహింపరానిది - శూరులకును
రాచమర్యాదలన్న విరాగవృత్తి
చూపు పోతన్న ధైర్యంబు చూచునపుడు
కక్షవీడదు వానికి శిక్షపడక !

గీ. లెక్కలేనన్నరీతిగా నొక్కవ్యక్తి
రాజధిక్కారమొనరింప రక్తియనుచు
అనుభవింపగలేను అన్యాయసరణి !
'భక్తి' యేపాటిదో - దాని శక్తి యెంతా !
గాంచునప్పుడును విడువ భాగవతదీక్ష !

గీ. రాజు నెదిరించగల్గిన రామభక్తి
ద్రోహబుద్ధులనేర్పునదో ! యనంగ
పోతనాహ్వాయు బోధనరీతి పలుకు !
నేర్పుచున్నాడు శ్రీరంగనీతులతడు !

(ప్రవేశం రాజభటులు)

ఏమిరా ? ఏదీ పోతన్న ? ఏదీ ఆయన భాగవతము ? అలా దిగాలుపడి చూచెదరేల ? పంపినపని యేమాయెనదో తెలుపుటకు యింత ఆలస్యమెందుకు ? ముఖాలను వాల్చుచున్నారేమి ?

రా :—మహాప్రభూ ! మమ్ములను క్షమించుడు. మావల్ల అపరాధము రవ్వంతయులేదు. రాజాజ్ఞను పాలించినాము. పోతన్నగారికి ప్రభుసందేశమును వినిపించితిమి. ఎప్పుడో రామాంకితమైన తన భాగవతమును ప్రభువులకంకితమిచ్చుట సమంజసము కాదని అయిష్టమనీ అధర్మమనీ చెప్పినాడు ప్రభూ !

సర్వ :—పిరికిపందలు ! అసమర్థులు !!

రా :— అట్లనకుడు మహాప్రభూ ! 'మీరు భాగవతముతో వచ్చిననుసరే - లేక మాకా గ్రంథ మిచ్చిననుసరే' అని అన్నాము.

సర్వ :—ఆ బాపనయ్యను లొంగదీసి గ్రంథమును సంపాదించలేనిశక్తి గాల్చనా ?

రా :—కాదు ప్రభూ ! ఆయన దేనికీ ఇష్టపడకపోయినాడు. దౌర్జన్యమున పోతన్న యింటిలో మేమందరమూ ప్రవేశించినాము. పూజాగృహమును ఆక్రమించినాము. భాగవతమును సమీపించితిమి. దానిచుట్టును ఏదో చక్రము పెద్ద హోరుతో తిరుగుచున్నది. స్వామీ యింతలో అకస్మాత్తుగా ఒక పెద్ద కోతివచ్చి మమ్మందరను భక్షించు నంతటి క్రోధావేశమును చూపినది. నేలను పడద్రోచి కొట్టినది. మా యెముకలు విరిగినవి. మా రక్తనాళములు పగిలిపోయినవి. మా ప్రాణములు యెక్కడికో యెగిరిపోయినవి. పాపము ఆ పోతన్నగారి పరివారమూ పరిచర్యలు చేయగా ప్రయాణమైన ప్రాణములు మరలుకున్నవి ప్రభూ! అవియుగాక ఏకశిలానగరవాస్తవ్యులు అందరూ పోతన్నపై అవ్యాజప్రేమను చూపించుచున్నారు. అతనిపై యీగను వాలనీయమని కంకణము కట్టినారు. క్షమించుడు మహారాజా! ప్రజానురంజకుడైన రాజు – స్వార్థపరుడై పరమేశ్వరాంకితమైన భాగవతగ్రంథమును కోరి – కోరికను దీర్చలేక ఒకభక్తునకు యిట్టి యిక్కట్లనుగూర్చుట న్యాయము కాదనియు – ఇట్టి అన్యాయపాలన అంతర్యుద్ధములకు దారి తీయుననియు ప్రజావిశ్వాసమునకు దూరమగుననియు శ్రీనాథునికి తగదనియు తమతో పలుకమన్నారు ప్రభూ!

సర్వ :—(హేళనగా) ప-లు-క-మ-న్నా-రు ప్రభువట! సిగ్గులేక వాగుచున్నారు. మీవంటి అసమర్థులు రాజభటులుగావుండిన చాలు. స్వర్గసీమ నరకకూపము అగుటకు అభ్యంతరములుండవు

శ్రీ :—మహారాజా! ప్రజలసమైక్యస్వరూపమే ప్రభువుగదా! అనువ్రూహాతో ప్రజల సందేహమును యీరాజభటులు గొనివచ్చినారు. వీరిదోషము రవ్వంతయు లేదు ప్రభూ! నాకు శలవీయుడు.

(శ్రీనాథుని నిష్క్రమణ)

సర్వ :—దోషము! ద్రోహము!! దోషము!!! ఎవరిదోషమూ లేని నాడు వాకెందులకీ రోషము !!!!

ఇక ఉపేక్షించిన వీలులేదు. రాజద్రోహియైన యీపోతరాజును తగినరీతి శిక్షింపవలయును. లేనిచో గ్రంథము మితిమీరుచున్నది. వట్టి అసమర్థుడనని అనుకొని యీ పోతరాజు అక్రమముగా చరించుచు న్నాడు. యీతనికి వెంటనే పాఠము నేర్పవలయును. (ఆలోచించి) ఓయీ రాజభటులారా! (పత్రికవ్రాసి మొహరువేసి) ఇదియే నాఆజ్ఞ దీనిని గొంపోయి పోతన్నకు చదివి వినుపించుడు. దీనితో పోతరాజు తన భాగవతగ్రంథమును మాకు స్వాధీనము చేయుటో లేక మా సామ్రాజ్య సరిహద్దులను విడనాడి పరరాజ్యంబులలో లేక విజన ప్రదేశములలోనో తల దాచుకొనవలసినదని సపరివారముగా. సకుటుంబముగా తక్షణమే ప్రయాణము కావలసినదని చెప్పుడు. పోతన్న యింటిని సోధల పఱచి భాగవతమును అన్వేషించి శీఘ్రముగా పొండు. సమాధానము సాయంత్రములోపుగా రావలెను. (రాజభటుల నిష్క్రమణ)

(తెరలో సంగీతము)

గేయం.

నిను భజించినవారికి కీడులు
లేవుగా! లేవుగా!!
అనవరతము నీపదసేవనమే
గోరెద! గోరెద!!
రఘుకులభూషణ రామా రామా
అఘువినాశన రామ! రామ!!
దీనులబ్రోచే దొరవని నిన్ను
వేడితీ! వేడితీ!!
ఆర్తశరణ్యుడవనియే నినుమది
పాడితీ! పాడితీ!!
రఘుకుల భూషణ రామా రామా
అఘువినాశన రామ! రామ!!

సర్వ :— ఆహాః శిథిలహృదయాలపై మధురరసము చిలికించి సట్లుగా నున్న యీ సంగీత మెవరిదోగదా ! ఆహాః అదేదో వేదాంత గీతిక ! జీవననాటకమును స్పష్టీకరించు తత్వబోధ !

(ప్రవేశము చిదానందుడు)

చిదా :— శ్రీ శ్రీ సర్వజ్ఞసింగమహీపాలునకు శుభాశీస్సులు !

సర్వ :—(నివ్వెరపాటుతో చూచి) మహాత్మా ! మీ రెవ్వరు ?

చిదా :— సీ. విమలగంగానదీ వీచికలందిచ్చు
వాయువులపియె సేవకులు మాకు !
పగుల కిభేద్యమై భయమును గల్పించు
గొప్ప ప్రాకృతపమె కోటమాకు !
ఋతుల సింగారాన నిరత మానందించు
ప్రకృతియే నర్తకి భామ మాకు !
మమకారహితాన మాధవున్ పూజించు
'స్వామి' నామమె స్వారాజ్యంబు మాకు !

గీ. పరసుఖాలకు వేల్పడి వరలువేళ
మైహికంబును గనని మా యాత్రికులకును
రాజయోగులటందురు రాజులెల్ల
మంత్రిసామ్రాజ్యపాలన మా మతంబు !

సర్వ :—మంత్రిసామ్రాజ్యపాలకులా ? అదేమిరాజ్యము - అదెక్కడిది ?

చిదా :— సీ. పొగరన్న యెవడైన పొందరానిదటంచు
తెలిసినవారలే తెలిపిరెపుడో !
తన్నుతాపొగడు నధములకుగూడను
కన్పించదని విదుల్ విన్పిరెపుడో !
ఆకువిరోధాల కంకితుండగునెడ
చూడలేడనిగూడ పాడిరెపుడో !

ధర్మంబు నరయని తాపసహింసకుల్
గనలేరటంచును గాంచిరెపుడొ!
గీ. అవనిలో లేదు గాని యీ యవనికిపుడు
బంధుమర్యాదలను పంపు పరమపురము
మంత్రసామ్రాజ్య మనినచో మాటలగునె!
మెఱుగుటకుగూడ సంస్కృతి వరలవలదె?

సర్వ:—సంస్కృతి - యనుచున్నారు. నాకు సంస్కృతి లేదందురా?

చిదా:—బిడ్డా! నీవు మహారాజనైనంతమాత్రమున అంతయు నీకు తెలియవలెననియున్నదా? తెలుసుకోవలెనని తహతహపడువారికే తెలియని రహస్యములు లక్షలున్నవి. విజ్ఞానము గట్టులేని కడలి రీతిగా పాలసముద్రము చంద్రుని చూచి ఉప్పొంగునట్లుగా వ్యాప్తిచెందుచున్నది. సంస్కృతి నాకు లేదా? అను నీ ప్రశ్నలోనే అహంభావము స్పష్టమగుచున్నది. మానవులు ఆత్మవిశ్వాసములేక అభివృద్ధిపొందలేరు. అహంకారముతో అవకాశములను పొందలేక నిరాశాంకితులగుచుందురు. సత్యం - శివం - సుందరం అను మంత్రోపాసన - దాని యదార్థ్యము యెరిగినవాడే సంస్కారి. నీకు సంస్కారము గలదనుకొనుచున్నావు అజ్ఞాన పిశాచికి ఆహుతైన అహమాయకుడవై సత్యపదార్థమును గుర్తించలేకున్నావు.

సర్వ:—కవిరాజుల కావ్యసుధారసములతో నిరతమూ ఆనందించు నాకు సంస్కారమే లేదా? నేనే అజ్ఞానాంధకారమునమున్నానా?

చిదా:—బిడ్డా! ఆ అహంకారబీజము నీలో ప్రవేశించి మొలకలెత్తి పెరిగి పెద్దదై వృక్షమై అభేద్యముగానున్నది. దానిమహిమవల్లనే 'నేను' 'నాది' అను అహంకృతి నిన్నువిడనాడకున్నది.

సర:—మీ సంభాషణము అయోమయముగానున్నది!

చిదా:—నా సంభాషణము అయోమయముగాదు. నీ ప్రవర్తన అయోమయముగానున్నది.

సర్వ :—రాజదర్బారున - రాజసన్నిధానమున - యీఅధిక ప్రసంగములు మానుడు!

చిదా :—ప్రభుశక్తి ఒక్కటే! యీ నరులకు వీరి అహంకృతులకు భయము లేనేలేదు. మంత్రము మీ మారణయంత్రములకు తంత్రము - మీ సామ్రాజ్యమునంతను గడగడ లాడించగల్గిన తాహతు యీ రుదురాలే పీర్చుకున్నది రాజా! నీ వున్నావు - నేనున్నాను చూపించమందువా నాథా! ఎటిగించమందువా రామశక్తి! (చేయి చాచి చూపును)

సర్వ :—మహాత్మా! ఏమియీ ఆశ్చర్యము. నా సామ్రాజ్యము మీ చేతిలో - మీ అరచేతిలో కన్పించుచున్నది. ఇదియేమి నాశరీరము వణకుచున్నది. శత్రుసముదాయము చించిచెండాడిన నాహస్తము దడదడలాడుచున్నది. కదనరంగమున కప్పిగంతులు వేచిన నా కాలు కదలకున్నది. అరివీరవర్గాల అంచనాలను తలక్రిందులు చేసిన నాబుద్ధి మందగించుచున్నది. మహాత్మా! యీరహస్యమేమో యోచింపరా! యిదంతయు నాజీవితమునకు చాలా వింతగానున్నది.

చిదా!:—బిడ్డా యిటుచూడుము. నీవు నీరాజ్యము అను మమకారమును నీలోచంపుటకు నేనురాజను అను అహంకారమును నీలో మాయముచేయుటకు యిట్లు చేసినాను.

శా. కారేరాజులు రాజ్యముల్ గలుగవే గర్వోన్నతిన్ బొందరే
వారేరీ సిరిమూటగట్టుకొని పోవంజాలిరే భూమిపై
పేరైనన్ గలదే శిబిప్రముఖులన్ ప్రీతిన్ యశఃకాములై
కోర్కెలు వారలన్ మఱచిరే యిక్కాలమున్ భార్గవా!

అన్నట్లు నీవు నేను వున్నందువల్లనే యీ జగము సాగుచున్నదను కొనుట పొరపాటు, రాజులురానీ - రాజులుపోనీ యీ ప్రకృతి రంగము మామూలుగనే నాటక ప్రదర్శనముల జేయుచుండును. నాయనా! నీ రాజ్యాహంకారము నీకు కొంపకు చిచ్చుపెట్టునేమో యని భయపడుచున్నాను.

సర్వ :—అదేమి మహాత్మా !

చిదా : — కుమారా ! ఒకకవి పరమేశ్వరున కంకితమిచ్చి ఒక గ్రంథమును రచించినప్పుడు తన కా గ్రంథమిమ్మని రాజు కవిని బల వంతపెట్టుచున్నాడని ప్రజల గుసగుసలలో విని వచ్చినాను. నీవేనా నాయనా యీ తప్పుపనిచేయుచున్నది?

సర్వ :—ఔను మహాత్మా ! ఆ గ్రంథమనిన నాకు ఆశమెండు

చిదా :— ఆశ !—అదియే కర్మకు మూలము ! అందుకని పర మేశ్వరునికన్న ఆధిక్యుడనని గర్వపడెదవా ?

చిదా :— కాదుస్వామీ !

చిదా :— మరెందుకయ్యా పరమేశ్వరాంకితమైన గ్రంథమును నరాంకితము చేయుమచున్నావు? యీ పాడుకథ చరిత కెక్కు సర్వజ్ఞుడు అవివేకియై భాగవతముకోసమై అమాయకుడై రాజర్షియైన భక్తపోత న్నను బాధలగూర్చినాడని భావిప్రజానీకము నిన్ను దూరునంతటి శాశ్వతంబగు అపకీర్తికి ఆహ్వాన మిచ్చెదవా ? వెఱ్ఱివాడా ! యిహము నకూ పరమునకూ చెడినవాడనైతివి ! ఇంతియేనా నీ జీవిత పరిణితి ?

సర్వ :—(ఆలోచించి ఆలోచించి సాగిలిపడి) తప్పే స్వామీ క్షమింపుడు !

చిదా :— క్షమించువాడను నేనుగాను ఆ పోతరాజు. నేడే ఏక శిలానగరికి బయలుదేరుము. ఆ భక్తుని పాదములపై వ్రాలి క్షమించు మనుము. అతని ప్రశాంతవచనములే నీకు మనశ్శాంతి నీయగలవు. ఏమందువు ?

సర్వ :—చిత్తం ప్రభూ – తప్పక యిప్పుడే పోయెదను.

(నిష్క్రమణ)

Δ

# పదిహేనవరంగము

ఏకశిలానగరము – రాజవీధి – ప్రవేశం కొందరు భక్తులు

పురజనులు - పోతన్న - అతని కుటుంబము - రాజభటులు.

రా :—విన్నారుగదా ! పోతన్నగారూ ! ప్రభువులవారి ఆజ్ఞాను సారముగా తమరు తమ పరివారముతో సహా శ్రీ శ్రీ సర్వజ్ఞసింహుల వారి సామ్రాజ్య సరిహద్దులను విడనాడి యెక్కడికో మీ యిచ్చవచ్చినచోటకు పోవలెను. మీరు ఏకశిలానగరమును వీడినట్లు వెంటనే ప్రభువులకు మేము విన్నవించవలసియున్నది.

పో : — నాయనలారా ! మీరుచేసిన దేమున్నది. ఇందు మీ తప్పేమున్నది. ఎవరికర్మను వారు అనుభవింపక తప్పదు నాయనలారా! బ్రహ్మదేవుడు మూడు పంక్తులలో ప్రతివాని నొసటయందును వాని ఫలితానుభూతిని సంగ్రహపరచినాడు. సృష్టిరహస్యమును యెఱుగలేక పరమేశ్వరునిలీలలగుర్తించలేరు. నా కష్టము నా సుఖము అని వృధాగా అమాయకులు వ్యాకులపడుచున్నారు.

సీ. తనకత్తితోడ శాత్రవ సమూహము చించు
 పరెన్నికన్నన్న వీరుడైన
తనగొంతుతోడ మదానవహమునను దా
 రంజించుగాయక రాయడైన
తనగంటమున సన్నుతగతిగ కృతులను
 రచియించగల కవి బ్రహ్మయైన
తనకిరీటముతోడ ఘనరాజ్యసంపెటు
 మురిపించురాజన్య మూర్తులైన

గీ. కర్మకెప్పుడు తలవొగ్గి గ్రాలవలయు
 మారుమాటలు వచియించు మాడ్కిలేదు

అనువింపకమానుట అసలె లేదు
కర్మమర్మము నెఱుగుటే కష్టమయ్యా!
సీ. స్వేచ్ఛానువర్తికి తుచ్ఛమాదాస్యంబు
కల్పించునట్టిది కర్మకాదె!
వీధివైరాగిని వేడుకన్ ప్రభువుగా
నిర్మించునట్టిది కర్మకాదె
పాలించుప్రభువును వట్టిభిక్షుకురీతి
గాసిల్లచేయుట కర్మకాదె!
శాంతిభద్రతనింపు సౌఖ్యభూమినయొక్క
కాటిగాచేయుట కర్మకాదె!
గీ. సత్యమును నిర్ణయించగా శక్తి లేక
పాడుబంధాల బారినివదల లేక
కర్మయనుదాని నెఱుగరీకాలమందు
ఊహాలన్నియు వట్టి - అపోహలయ్యా!
ఏకశిలానగర వాస్తవ్యులారా!
సీ. చూపించినారలు సోదరప్రేమను
భారతీయప్రతిభ వరలునటుల!
సేవించినారలు శ్రీరామచంద్రుని
భాగవతపఠన భక్తినిలుప!
నశింపించినారలు నాడియాస నెఱుగని
ముని జీవనంబును మురుపునెరపి!
స్థాపించినారలు శాంతి - అహింసను
పవిత్ర సూత్రాల తీవియనగ!
గీ. అట్టి సౌశీల్యవంతుల అండవీడి
యేగుచున్నాడ - యేడకో - యీవిధాన
మరలమిముచూడు భాగ్యంబు వరలదేమొ
అందుకొనుడయ్యా - పోతన్న వందనాల!

సీ. నొప్పించి నానేమొ! తప్పులతో మిమ్ము
శమియింపగదరయ్య సాదరాన!
తప్పించి నానేమొ ధర్మంబు నడకను
ఇతరంబులనక క్షమించుడింక!
భాషించినానేమొ వర్ణదోషములతో
మన్నింపరయ్య సమ్మానమునను
వూహించినానేమొ పుణ్యుల వేరుగా
కఠినతన్ గాంచక గావరయ్య
గీ. తెలుగువాడను పుట్టితిన్ తెలుగుగడ్డ
తెలుగురాజుల యాగ్రహాతీవ్రతకును
ఆస్పదైనట్టివాడను ఆంధ్రులార!
మరలమిముచూచు భాగ్యంబు వరలకున్న
పరప్రదేశమునందు నాప్రాణయాత్ర
గలుగువేళల పోతన్న - తెలుగువాని
అనుచు మదినుంచుకొనుడయ్య ఆర్యులార!

పురజనులు :—(వారిలో) అయ్యో! పోతన్నగారి మాటలు వింటే గుండె తరుగుకుపోతుందిరా! ఎందుకురా ఆరాజుగారికి యీ యనమీద యింతకోపం?

యువజనులు:— గేయం.

ప్రజల హింసించేటి
ప్రభువులెందుకురా!
రక్తినేనింపని
రాజులెందుకురా!
పేదహృదయాలలో
పెనుగాలివీచింది!
వీరహృదయాలలో
విప్లవము రేగింది

ప్రజలహింసించేటి
ప్రభువు లెందుకురా !
రక్తినేనింపనీ
రాజులెందుకురా !

రైతు సౌఖ్యాలనూ
గోతిలోగూల్చేటి
మాయరాచరికంబు
మనకుయెందుకురా !

ప్రజలహింసించేటి
ప్రభువులెందుకురా
రక్తినేనింపనీ
రాజులెందుకురా !

సర్వజ్ఞజ్ఞానమూ
ఉర్వీశుజ్ఞానమూ
స్వార్థంబు చూపింప
సహింపలేమురా !

భక్తులు:—మహానుభావా! పోతరాజుగారూ! మీరు యెక్కడకు వెడితే అక్కడికే మేమూవస్తాం. ఇంతవరకు రామనామసంకీర్తన చేసి మీభాగవతసుధనగ్రోలి ఇక మీకడనుంచి మిమ్ము విడనాడి యేకాంతంగా మేము వుండలేము స్వామీ, మీతోపాటు కలియో! గంజియో! త్రాగి వుంటాము. అనుగ్రహించండి దేవా !

పో:— ఏకశిలాపురీనివాసులారా ! మీరందరు నాకు ప్రభువులవారు అపచారముచేసినట్లు అపోహపడుచున్నారు; అట్టి నిరాధారమైన వార్తలను మీరెన్నడు ఆహ్వానించకూడదు. అదియునుగాక పోతన్న లేనంతమాత్రమున మీ భావిజీతములే భంగపడినట్లు వాపోవుచున్నారు. నాయనలారా ! పోతన్నలు రానిండు- పోతన్నలు పోనిండు యెవరికర్మానుసారముగా వారు జీవితమునందు కష్టమో ! సుఖమో !

అనుభవించి తీరవలయునుగదా ! పోతన్న భౌతికదేహము మీకు దూర మైనను అతని మానసిక శరీరము మీ హృదయాలలోనే వుండును గదా ! అశాశ్వతమైన భౌతికదేహముపై ఆపేక్షను అధికపఱచకుడు. సత్యపదార్థమై శాశ్వతమైన పరంజ్యోతిని స్తుతించుడు. మీ కందరకు నా హృదయపూర్వక వందనములు.

అందరు :—పోతరాజుగారికీ జై ! పోతరాజుగారికి జై !

(ప్రవేశం శ్రీనాథుడు - సర్వజ్ఞుడు)

సర్వ : — శ్రీనాథకవిరాజా ! పోతరాజు మన అదృష్టవశమున యింకను సామ్రాజ్యమును వీడలేదు.

శ్రీ :—ఆలశించక వెంటనే అతనిని క్షమించుమని ప్రార్థించుడు మహారాజా !

సర్వ :—తప్పకపోయెదను - తమరుకూడ నా చెంత నిలుచుండుడు కవిసార్వభౌమా !

శ్రీ :—సరే - అల్లవచ్చెదను - రంపికపోవుదము !

(పోతన్న పాదములపై సర్వజ్ఞుడు వ్రాలును)

పో :—(లేవదీసి) మహారాజా ! యెందులకీ వందనములు ! ప్రభువులు మీరు - ప్రజలము మేము - ఆజ్ఞాపించు ఆధిక్యులుమీరు. ఆజ్ఞలను అనుసరించువారము మేము ! వృథాధిక్యతి మా కారోపించుట మమ్ము అవమానపఱచుటకాదా ప్రభూ !

సర్వ :—పోతన్నగారూ ! గతజల సేతుబంధనము వృథాగదా ! అవివేకినై న్యాయాన్యాయ విచక్షణలేక, ధర్మాధర్మ పరిజ్ఞానము నందక మీకు శ్రమగల్గించినాను. యిడుముల బడజేసినాను. సాధుసజ్జన సంతతికి సంతాపము కల్గచేసినవారికి కులక్షయమగునని పెద్దలవలన నేడెవిన్నాను అహంకృతి నణగించి భాగవతమును అంకితముగొనవలెనను ఆశను వీడి మీకు పంపించిన ఆజ్ఞను రద్దుచేయుటకునూ మిమ్ములను క్షమించమని ప్రార్థించుటకును వచ్చినాను ప్రభూ !

(తెరలో సంగీతము)

జీవా ! మేల్కొనవా !

మాయాజగతిని వ్యామోహాముతో

హేయపథమున పడిపోయితివి !

జీవా! మేల్కొనవా!
క్షణికసుఖంబును శాశ్వతమనుకొని
కలిమాయలలో కలసిపోయితివి!
జీవా! మేల్కొనవా!
పాలకుడెవడూ! పాలితుడెవడూ
నేలనాదనుచు గర్వపడితివా!
జీవా! మేల్కొనవా!
జగదధినేతను సమ్ముదలీల
సంసేవింపగ జాలమికేల!
జీవా! మేల్కొనవా!

అదుగో! నా అజ్ఞానాంధకారమును పోగొట్టి నా రాచఠీవియందలి నిజానిజములను వెల్లడించి జ్ఞానభిక్ష నొసంగిన శ్రీ చిదానంద పుంగవులు యిటులనే వచ్చుచున్నారు.

(ప్రవేశం చిదానందుడు)

గురువర్యా నమస్కారం.

చిదా:—మంచిసమయమునకే వచ్చినాను. పశ్చాత్తప్తుడైన యీ సర్వజ్ఞసింహుడు క్షమార్హుడు పోతన్నా. తన అపకృతులను తానే ఒప్పుకొనుచున్నాడు. అతని తప్పిదముల మన్నించుము. మహర్షివై ప్రశాంత జీవనమును సాగించుకొనుము.

పో:—గురుకటాక్షము!

శ్రీ:—మహాత్మా! నాదొక కోరికవున్నది. తమరే తీర్చవలయును.

చిదా:—చెప్పు బిడ్డా.

శ్రీ:—(శారద - మల్లన్నలను దగ్గరకు తీసి) ఈమె నాముద్దుల బిడ్డ. శారద! ఇతడు మాబావ పోతన్న కుమారుడు మల్లన్న. వీరిరువురి పాణిగ్రహణ మహోత్సవము మీా సన్నిధానమున నేడే జరుగవలెనని కోరుచున్నాను.

చిదా:—మంచిది. మహర్షియైన పోతన్నతో వియ్యమందుట నీపూర్వజన్మ సుకృతముకాదా శ్రీనాథా! పోతరాజా! ఏమందువు? ఇష్టమేనా.

పో:—ఔను ప్రభూ!

(మంగళవాద్యఘోష)

చిదా:—(శారద మల్లన్నలకు పాణిగ్రహణముచేసి) నూత్న దంపతులారా!

ఉ. శ్రీలకు నాలయంబనఁగఁ జెల్లిన భారతభూమియందు పు
ణ్యాలఫలంబుగా జననమందు వధూవరులార! నేడు ప్రే
మాలయ మంటపంబునకు హర్షమెలర్పఁగ వచ్చినారు! యె
క్కాలము మీకు దిక్కగుచు కాంచనచేలుడు గాచు గాపుతన్

సీ. పరమేశ్వరుడు తనపార్వతీ సతిగూడి
చల్లనికృప వెదజల్లుగాత
వనరుహాసనుడు తన వాగ్దేవితోగూడి
హితవుగా దీర్ఘాయు విచ్చుగాత
వనమాలి ప్రియురాలు వరలక్ష్మితోగూడి
కోరినసంపద గూర్చుగాత
రాజగోపాలుండు రమణీరాధనుగూడి
కన్నాకుగా మిమ్ముగాచుగాత

గీ. శాంతిసఖ్యత మీలోన సాగువేళ
భాగవతదీక్ష మీ కడ వగలువేళ
ప్రేమపూజారులన్నటు వేడ్కమీర
నడుపుకొనుడయ్య సంసార నావనింక!

ఉ. పెండిలిపీటయన్న నది ప్రేమవిహారుల ముద్దుమూట! యీ
పండువనాటి నాటక ప్రబంధమునందలి నాందిపాట! మీ
యండను సిత్యనూత్నముగ హర్షముగూర్చెడి పూలతోట! ఆ
దండ, సుధామయోక్తులను దంపతులార ముదంబునందుడీ!

గీ. తెలుగుదేశపు విఖ్యాతి తెలుపునట్టి
వీరసంతాన విభవంబు వెలయువేళ
ఆంధ్రమాతకు నానంద మందఁజేసి
నిండుగర్వంబు మీరింక నిలుపవలయు!

పోతనా!

సీ. అయిన దయిపోయినదిగాని! ఆ ప్రభుండు
నన్ను మన్నించమని వేడుచున్ననాడు

తన యవాంకృతి విడనాడి దనరునాడు
అతని శమియించగా కాలహరణమేల ?
రాజా ! సర్వజ్ఞసింగభూపాలా !
గీ. రాజవైనంతమాత్రాన రాజఋషుల
బాధపెట్టుట తగదోయి ! భద్రగతిని
యిట్టితప్పులు – ముందురానట్టి రీతి
ప్రజల పాలించుకోవయ్యా ప్రథిత గతిని !
అందరు :— గేయం.

పూతచరిత్రుడు
పోతనసుండీ !
ఆతండాంధ్రుల
కాభరణమండీ !
రాజులగెల్చిన కవిరాజండీ
రాజ్యము గోరని యోగియేనండీ !
పూతచరిత్రుడు
పోతనసుండీ
ఆతండాంధ్రుల
కాభరణమండీ !
కలిమాయలకు లోబడడండీ
ఘనుడై భక్తిని గాంచెనుసుండీ !
పూతచరిత్రుడు
పోతనసుండీ
ఆతండాంధ్రుల
కాభరణమండీ !
పఠియించండి భాగవతంబు
స్మరియించండి పూజ్యనామంబు !
పూతచరిత్రుడు
పోతనసుండి
ఆతండాంధ్రుల
కాభరణమండీ !

మంగళం.